# గంగాపుర మాహాత్మ్యము

248
Donated to Sri Krishna Devaraya Granthalayamu.



గ్రంథకర్త

శ్రీ రెడ్రెడ్డి మల్లారెడ్డి దేశాయి




కృతిప్రకాశకులు

శ్రీ రెడ్రెడ్డి ( గడ్డంపల్లి ) రామకృష్ణారెడ్డి దేశముఖుగారు



శాలివాహనశకము ౧౮౭౬ భాద్రపదము

క్రీ. శ. ౧౯౫౪

సర్వస్వామ్యములు
విజ్ఞానవర్ధనీ పరిషత్తువి

*

ప్రతులు ౫౦౦

*

21887 పద్యకావ్యమాల
మ-29

ప్రథమ ముద్రణము

శా. శ. ౧౮౬౮ వ్యయసంవత్సరము

భాద్రపదమాసము

క్రీ. శ. ౧౫-౯-౧౯౪౬

*

వెల రు ౧-౮-౦

*

సికిందరాబాదు

ఓరియంట్ ముద్రణాలయమున

ముదిగొండ సాంబశివరావుచే

ముద్రింపబడియె

# పీఠిక

## గంగాపురచరిత్రము

గంగాపుర మొక పెద్ద జాగీరు గ్రామము. దాని జనసంఖ్య ౨౦౦౦కు పైబడియున్నది. ఒక ముస్లింజాగీర్దారు దానికధికారి. అది మహబూబునగర జిల్లాలో చేరి జడ్చర్లస్టేషనుకు మూడుమైళ్ళ దూరములో నున్నది. ఆగ్రామానికి చాదీశ్వరీదేవాలయము తీర మందుకల ఒకపెద్ద చెరువును పది పన్నెండు కుంటలున్నూ కలవు. కుంటలలో నంబులకుంట యను నది ఒక వేయేండ్ల నాటిది. ఎందు కనగా దానిపై నొక చాళుక్య శాసనము కలదు. ఈ గ్రామములో ఎక్కడ జూచినను శాసనములు, శిధిల దేవాలయములు, సుందర విగ్రహములు, భగ్నములైన విగ్రహములు కలవు. అవి గంగా పురము యొక్క ఈనాటి దుస్థితిని ఒకనాటి వైభవమును ప్రకటించు చున్నవి.

ఆ గ్రామానికి ఒక మైలుదూరములో గొల్లత్తగుళ్లు అను శిథిలాలయములు కలవు. ఆ గ్రామానికి సమీపమందుండు రెండు మూడు గ్రామములలో ప్రాచీనాలయములు శాసనములు లభించు చున్నవి. ఆ గ్రామమునకు అరకోసు దూరములో మీనాంబరియను పెద్దవాగు కలదు. దానిని స్థలపురాణములో ఒక పవిత్రనదిగా వర్ణించియున్నారు. దాని తీరమందనేక లింగములు ఒక శివాల యము కలవు. ఆ నది కృష్ణానదిలో కలయుచున్నది.

శైథిల్యమునుండి పునరుద్ధరింపబడి ఇప్పుడు పూజాపునస్కార ములను నోచుకొన్న కేశవాలయమును చాళుక్యులలో వైష్ణవాభి

మానము ప్రారంభమైననాడు అనగా ఇంచుమించు క్రీ. శ. ౧౦౦౦ లో నిర్మితమైనట్టిది. దేవాలయము గోడలపై బయటిదిక్కు చాళుక్య శాసనములు చెక్కినారు. ఈ దేవాలయము పేర ప్రతి సంవత్సరము మాఘశుద్ధ సప్తమినాటినుండి అయిదు దినములు పెద్ద జాతర జరుగును.

గంగాపుర నిర్మాణము చాలప్రాచీనముగా కానవస్తున్నది. అచ్చట ఒకటిరెండు జైనశిల్పములుగా కానవస్తున్నవి. మీనాంబరీ తీరమందలి శైవాలయము వెనుకభాగమున నున్న విగ్రహమొకటి జైనవిగ్రహమువలె నున్నది. గంగాపురమునకు ప్రాచీననామము మాయాపురియని యుండెనని నరపతి విజయమను నామాంతరము కల రామరాజీయ కావ్యములో వెంగయ్యకవి రచించియున్నాడు. మాయాదేవి బుద్ధుని తల్లి కావున బౌద్ధుల ప్రాబల్యముండిననాడు దానికా పేరువచ్చెనేమోయని యూహింపవచ్చును. మీనాంబరీ తీరమం దుండినందున మత్స్యపురియని దీనికి నామాంతరమైయుం డును. దీనికి దురిత కోలాహలము అని మరొక పేరుండెనట. ఈ పదాళి కర్థము సరిగా కుదురుటలేదు. పాపముల బోగొట్టునట్టిది అని పూర్వుల అభిప్రాయమై యుండును. గంగాపురమని దీనికి చాళుక్యులకాలములో పేరు వచ్చినట్లున్నది. ఈ పేరేలవచ్చెనో తెలియదు. గంగేశ్వరుడుఅను లింగమేమైన అందు ప్రతిష్ఠితమై యుండునో యేమో! గంగాపురములోని ఒక శాసనము దీనికి సహాయపడుతున్నది. అందిట్లున్నది.

"శ్రీమత్త్రిభువనమల్ల దేవర విజయరాజ్య
భీమరసను గంగాదేవియుంమాడిద
ప్రతిష్ఠ గంగేశిరమదేవర ధర్మమాగి నహాయసులు
దెంబదు కొట్టివాకెయు ... ..."

అని తెలంగాణా శాసనములు చాళుక్యశాసనభాగము-నంబరు 3౨ లో కలదు. కాని ఈ శాసనము గంగాపురములో కాన వచ్చుట లేదు, పైగా ఇందు చాలా తప్పులున్నట్లు కానవస్తు న్నది. మరియు "కొట్టివాక" అని యందున్నది. కొలనువాకకు ప్రాచీననామము కొట్టివాక. కాన యిది కొలనువాక శాసనమో యేమో? గంగాపురమను పేరెందుకువచ్చె నని స్థానికులను విచా రించిన వారేమియు చెప్పజాలరు. పైనుదహరించిన శాసనములో "భీమసముద్రము" అను పేరు గలదు. అట్టిపేరుగల చెరువేదియు గంగాపురములో లేదు. కావున గంగాపురమను పేరెట్లు వచ్చెనో ఇప్పుడేమో చెప్పుటకు వీలులేదు. ఈ గ్రామమందు శైవవిగ్రహ చిహ్నలుండుటచేతను, దీని పూర్వనామము మాయాపురియగుట చేతను ఈ గ్రామము కనిష్ఠము ౧౫౦౦ ఏండ్ల క్రిందటిదై యుండు నని ఊహింపవచ్చును.

## గొల్లత్త గుళ్లు

గంగాపుర గ్రామమునకు ఒక మైలులోపల గొల్లత్తగుళ్ళు అను నిర్మాణములు కలవు. ఆ గుళ్ళలో ఇప్పుడాక గుడిమాత్రమే నిలిచియున్నది. అదియు కూలిపోవ సిద్ధముగా ఉన్నది. అది ఇంచు మించు ౨౦ అడుగుల ఎత్తున్నది. గోడలు నాలుగడుగుల మందము మలై యున్నవి. అంతయు ఇటికెలతోనే కట్టినారు. అవి చాలా గట్టివి. స్థానికులు కొందరు దాని యిటికెలను తమ ఇండ్లకు వాడు కొనుచు వచ్చినందున ఆ గుళ్ళు నామమాత్రావశిష్టమైపోయినవి. నిలిచిన గుడిప్రక్కన రెండు పెద్దదిబ్బ లున్నవి. అవి శిథిలమై పోయిన గుళ్లైయుండును. జనులు వాటిని గొల్లత్త గుళ్ళు అని బహు వచనముతో మాట్లాడుచున్నందున అందు కనిష్ఠము మూడుగుళ్లైన నుండి యుండును.

ఆ గుళ్ళనుగూర్చి స్థానికులొక ముచ్చటయగు కథను చెప్పుదురు. పాలు పెరుగు అమ్ముకొను ఒక గొల్లపడుచు భక్తురాలై తన యాస్తినంతయు వ్యయపరచి ఆ గుళ్ళను కట్టించెనట. అందుచేత ఆ గుళ్ళకు గొల్లత్తగుళ్ళని పేరు వచ్చెనందురు. కాని అది ప్రమాణము కానేరదు. మన పురాణాలలో తర్వాత పెంచినవారు శబ్దముల అర్థాన్నిబట్టి తమ ఊహాకు స్వేచ్ఛనిచ్చి కథలు కల్లలు వ్రాసిపెట్టిరి.

అయితే దీని యాథార్థ్యమెట్టిదో సరిగా చెప్పజాలము. మనమును ఊహించవలసి వచ్చును. శైవులలో పూర్వము గోళకి మఠాలు అనునవి ఒక వేయిఏండ్ల క్రిందట విరివిగా వింధ్యకు దక్షిణ దేశముననుండు దేశమంతటను వ్యాపించుకొని పోయెను. గోళకి పదమే పల్లెజనులనోళ్ళలో గొల్లక్కయై క్రమముగా గొల్లత్తగా మారియుండును. గోళకి మఠాలనుగూర్చి శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు అమరావతీ స్తూపములు అను పుస్తకములో ఇట్లు వ్రాసినారు.

"పాశుపత శైవసంతానమునకు భాగీరథీ నర్మదానదులకు మధ్యనుండు డాహాళదేశమందలి గోళకిమఠము ప్రధానమైనది. తెనుగుదేశమున పెక్కుమఠములు కట్టించినవారీ మఠమునకు సంబంధించినవారే. ఈగోళకీమఠముయొక్క యుపమఠములు కన్నడ దేశమందును ద్రమిళ దేశమునను నుండినవి. గోళకీమఠశాఖలు తెలుగుదేశమున కడప మండలమున త్రిపురాంతకమందును గుంటూరుమండలమున మందడమునందును వెలసినవి. ఈగోళకీమఠము క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినుండి దక్షిణాపథము నందెల్ల మిక్కిలి ముఖ్యమైన మఠసంస్థగ నుండినట్లు శాసనముల వలన దెలియవచ్చును". (పుట-౮3)

రుద్రమదేవి శా. శ. ౧౧౮౩ లో విశ్వేశ్వర గోళకియను మందడములోని మఠమునకు దానము చేసి అందు ఆబ్రాహ్మణచండాలముగా అందరికినీ అన్నదానము చేయ నిర్ణయించె ననియు, అందు విద్యాలయమును వైద్యాలయమును, స్థాపించెననియు పై గ్రంథ మందే తెలిపియున్నారు.

పాల్కురికి సోమనాథుడి బసవపురాణపీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిట్లు వ్రాసినారు.

“దశమ శతాబ్దికింకను పూర్వకాలమునుండి గౌడదేశమున గోళకీమఠమను పేర గొప్పశైవాచార్యమఠము ప్రఖ్యాతిగాంచెను. భావశంభు సోమశంభు ప్రభృతులు తన్మతాధిష్ఠాతలు. సోమశంభువు తన పేర నొకపద్ధతిని రచించెను. శివలెంక మంచన పండితుడు ఈ సోమశంభువు మనుమడట. ఈపరంపరవారు “కలచురి క్ష్మాపాల దీక్షాగురువులు” అని పలుచోట్ల ప్రస్తుతింపబడిరి. బిజ్జలుని కాలమున పశ్చిమ చాళుక్యరాజ్యమున నీ పరంపరవారు పలువురు శివాచార్యులుండిరి. ఏతన్మఠ పరంపరవారు వేలకొలది మహానీయులు దక్షిణాపథమందెల్ల వ్యాపించిరి. కేరళమునుండి విమలశివ, ధర్మశివ, విశ్వేశ్వర శివాదులు, తెనుగు దేశమునకు జేరిరి. విశ్వేశ్వర శివాచార్యుడు కాకతీయ గణపతిదేవ చక్రవర్తికి దీక్షాగురుడై యాంధ్రదేశమున కృష్ణాతీరమున మందర గ్రామమున గొప్ప మఠము నెలకొల్పెను”. (పుట ౭౮_౭౯)

కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకములో ఒక గోళకి మఠముండినట్లు శా. శ. ౧౧౭౮ నాటి యొక స్థానిక శాసనమువల్ల తెలియవస్తున్నది. (ఎపిగ్రాఫికల్ రిపోర్టు ౧౯౦౫)

గంగాపురములో శైవాలయములు విశేషముగా ఉండినవి. క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతములో ఉండిన పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో గంగాపురములో సహస్రగణ శివ భక్తులలో ముఖ్యులందరిని వర్ణించెను. త్రిభువనమల్లుని ఆరాధ్య గురువగు సకల ప్రవేశ భట్టారకుడు, "చక్రవర్తి శ్రేయార్థమాగి దైవజ్ఞరాదిత్య భట్టోపాధ్యాయగ్గ పెద్దణభట్టగ శ్రీమత్త్రైలోక్య మల్ల శ్రీకేశవపురద జ్యోతిర్వృత్తియం జ్యోతిశ్శాస్త్రపరీక్షా పూర్వ కందే వరిగెపాదపూజెయంకొండు ధారాపూర్వకమాడి" దైవజ్ఞ ఆదిత్య భట్టోపాధ్యాయునికి పెద్దణభట్టుకు దానము చేసెనని గంగాపురములో ఒక శాసనము కలదు. (తెలంగాణా శాసనములు పుట ౧౨౮) ఈ శాసనములో సరియగు పాఠమును పైనుదహరించినాము. ఆ దానము క్రీ. శ. ౧౦౯౨ లో చేయుబడెను. ఇతర శాసనములలో మరికొందరి పండితులను పేర్కొన్నారు. తర్కశాస్త్రమందు జ్యోతిశ్శాస్త్రమందు ఇతర శాస్త్రములలో "భట్టోపాధ్యాయులైన" వారు పలువురు గంగాపురములో నుండిరనిన విద్యాస్థానమగు గోళకిమఠము అందు తప్పకయుండియుండవలెను. ఆ గోళకి మఠము విద్యాపీఠముగా వెలిసియుండును.

గోళకిమఠస్థాపకులు వీరశైవములోని పాశుపతశాఖవారు. ఈ పాశుపతము దక్షిణహిందూస్థానములో అందునను ముఖ్యముగా దేవకీపురమనుచోట వ్యాప్తిపొందెను. అక్కడ ప్రసిద్ధ గోళకిమఠ ముండెను. అక్కడినుండి ఆ మతానుయాయులు దక్షిణ దేశ మంతటను వ్యాపించుకొనిరని బహుశాసనములు తెలుపుతున్నవి. అట్టి వ్యాపకులలో విశ్వేశ్వరశివుడు గణపతిదేవుని దీక్షా గురుడు. ఆ విశ్వేశ్వరగోళకిమఠానికే రుద్రమదేవి దానమిచ్చెను. గంగాపురములో త్రిభువనమల్లుని దీక్షాగురువగు సకలప్రవేశ భట్టారకుడుండెనుకదా. ఆ దీక్షాగురువుయొక్క గోళకిమఠమే

గొల్లత్తగుడియై యుండును. గంగాపురములో పైన తెలిపిన పండితులేకాక శ్రీగిరిపండితుడును (తెలంగాణా శాసనము - చాళుక్య సంఖ్య ౧) గణగరాజపండితుడును (తె. శా. చాళుక్య - శా. సంఖ్య ౫)ఉండిరనియు వారికి నీ దానాలుచేసిరనియు మరి రెండు శాసనములలో కలదు.

గోళకిమఠాలలో అన్నసత్రము, వైద్యచికిత్సలు, విద్యాప్రదానము జరుగుచుండు నాచారమున్నట్లు మందడశాసనమువల్ల ఊహింపవచ్చును. గంగాపురములో అనేక మహాపండితులుండినందున అచ్చటి "గొల్లత్తగుళ్ళ"లో వారు విద్యాసంస్థలను నడిపియుందురని ఊహింపవచ్చును. గొల్లత్తగుళ్ళు పెద్ద దిబ్బలైయున్నవి. ఆ దిబ్బలే పై విద్యాసంస్థలై యుండును. ఆ దిబ్బలను త్రవ్విన శాసనములేమైన లభించునేమో? పై యూహాలు స్థిరపడునేమో? ౮౦౦ ఏండ్లక్రిందట గంగాపుర మొక శైవవిద్యాపీఠమై యుండును. గొల్లత్తగుళ్ళనునవి తప్పకుండా గోళకిమఠాలే యని విశ్వసించినందున దాని చర్చ కొంతవిపులముగా చేయవలసి వచ్చినది.

## గంగాపుర ప్రాచీనత

పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్రములో త్రయోదశగుణసంకీర్తనములో గణసహస్రనామములను కొన్నింటి పేర్కొనెను. అందిట్లు వ్రాసెను.

" సంగయ్య, వనిపుర శంకరదేవ
డింగుళివైజవ్వ, గంగాపురంబు

బసవయ్య, ఫణిహారి బసవయ్య,

- - - - ౨వ భాగము పుట ౯౧

ఆదిగా గణ సహస్రనామములు
ఆదరణీయంబులై యొప్పునిట్లు

- - - ౨వ భాగము పుట ౯౫

ఇందు పేర్కొన్న గంగాపురము మన గంగాపురమేయై యుండును. గంగాపురమునుగూర్చి స్థలపురాణ ముండియుండును. నూరుయిన్నూరేండ్ల క్రిందటి స్థలాలకే మహాత్మ్యము లేర్పడినప్పుడు ఇంచుమించు ౧౫౦౦ ఏండ్లకు పూర్వముదగు గంగాపురమునకు స్థలపురాణ మెట్లుండదు. అట్టి స్థలపురాణము నాధారముచేసి కొనియే ఈ మాహాత్మ్యమును మల్లారెడ్డికవి పద్యాత్మకముగా రచించియుండును.

"మాయాపురీ మత్స్యపురీ, దురితకోలాహలం
కలియుగే గంగాపురీ"

అని నాలుగు యుగాలలో నాలుగు పేరులు గంగాపురికుండెనని స్థానికులు చెప్పుచుందురు. మల్లారెడ్డికవియు పైనాలుగు పేరులు నాలుగు యుగాలలో గంగాపురానికుండెనని వర్ణించెను. క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతములో ఉండిన వెంగయ్యకవి తన నరపతి విజయములో "గంగాపురాఖ్యతు ప్రతినామంబుగల మాయాపురంబు" అని వర్ణించియున్నందున మాయాపురమనునది ప్రాచీననామాంతరమని విశ్వసింపవచ్చును. మీనాంబికనుండి మత్స్యపురి నామ

మేర్పడియుండును. దురితకోలాహల మనుట స్థలమహాత్మ్యమున కిచ్చిన విశిష్టగుణమై యుండును.

## చాళుక్యకాలపు స్థానిక శాసనములు

ఈ గ్రామము పశ్చిమ చాళుక్యుల కాలములో చాలవృద్ధికి వచ్చెను. ఆ రాజు లనేక శివాలయములను కట్టించి, ఉన్నవాని నుద్ధరించి, పోషించి దానశాసనములను చెక్కించిరి. వారి సామంతులు, వారి ప్రజలున్ను తమ తమ శక్తికొలది దేవాలయములకు దానములు చేసిరి. వారికాలమునాటి శివాలయములు చాలావరకు శిథిలము లైపోయినవి. కొన్నితావులలో ఆలయముల జాడలు కూడా లేకుండ పోయినవి. అచ్చటచ్చట శక్తివిగ్రహాలు, వినాయక విగ్రహములు, భైరవ విగ్రహములు అతిసుందర శిల్పములతో కూడినవై కానవస్తున్నవి. మన కిప్పుడు లభించు గంగాపుర శాసనములు చాళుక్యశకములోనివి. చాళుక్యవిక్రమశకము శా.శ. ౯౯౮ నుండి అనగా క్రీస్తుశకము ౧౦౭౬ నుండి ప్రారంభమయ్యెను. త్రిభువనమల్ల బిరుదాంకితుడగు ఆరవ చాళుక్య విక్రమాదిత్యు డీ శకాన్ని తనపేర ప్రారంభించెను. చాళుక్యకాలపు శాసనాలలో ఈ క్రిందివి గంగాపురములో లభించినవి.

(౧) జగదేకమల్లుని కాలములో కొందరు సెట్టికులమువారు నగరేశ్వరదేవుని ప్రీతికై శ్రీ గిరిపండితుడను నతనికి దానముచేసిరని తెలుపు శాసనము. (తెలంగాణా శాసనములు = తె. శా. పుట ౧౦౫).

(౨) జగదేకమల్లుని కాలములో కొందరు సెట్లు నగరేశ్వర సోమేశ్వర దేవరకు చేసిన ధర్మమును తెలుపు శాసనము. (తె. శా. పుట ౧౦౫-౧౦౬)

(౩) జగదేకమల్లుడు కళ్యాణపురమందు రాజ్యము చేయుచుండగా అతని తనయుడు త్రైలోక్యమల్లుడు కేశవపురమున నొక దానము చేసెనని తెలుపు శాసనము. ఇందు గణగరాజపండితునికి నీ దానము చేసినట్లు తెలిపినారు. ఇంకొక విశేష మున్నది. గంగాపురమును కేశవపురమని ఇందు పేర్కొన్నారు. ఇతని కాలమువనో ఇంచుక పూర్వముననో చాళుక్యులు వైష్ణవమతము దిక్కు వాలినట్లు కానవస్తున్నది. అందుచేత వారు కేశవాలయమును నిర్మించి గంగాపురమునకు కేశవపురమని పేరు పెట్టిరి. (తె. శా. పుట ౧౦౭)

(౪) త్రిభువనమల్ల బిరుదాంచితుడగు చాళుక్యవిక్రముని మూడవసంవత్సర రాజ్యకాలములో అనగా క్రీ. శ. ౧౦౭౯ లో కొందరు సెట్లు దానము చేసినది తెలుపు శాసనము. (తె. శా. పుట ౧౧౭-౧౧౯)

(౫) పై త్రిభువనమల్లుని ౧౬ వ సంవత్సర రాజ్యకాలములో త్రిభువనమల్లుని ఆరాధ్యగురువగు సకలప్రవేశభట్టారకుడు అనేక తర్కశాస్త్ర పారావారుడును, జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుడును నగు ఆదిత్యభట్టోపాధ్యాయునికిని, పెద్దణభట్టునకు కొన్నిదానములు చేసినట్లు తెలుపు శాసనము.

ఈ శాసనములో విట్టణభిట్ట అని చదివినారు. కాని అది పెద్దణభట్ట అని చదువవలెను. (తె.శా. పుట ౧౩౪)

(౬) త్రిభువనమల్లుని కాలములో అతని దండనాయకుడు భీమేశ్వర దేవునికి దానము చేసిన శాసనము. ఈ శాసనములో కూడా

గంగాపురమనుటకుమారుగా కేశవపురమని వ్రాసినారు. (తె.శా. పుట ౧౨౯)

త్రిభువనమల్లుని కాలములో చాళుక్యవిక్రమశకము ౨౪ వ సంవత్సరములో సమస్త "సమయసమూహము" శ్రీ గణేశ్వర దేవుని అంగరంగ నైవేద్యములకు చేసిన దానమును తెలుపు శాసనము. ఈ శాసనములో గణేశ్వర అని చదువుటకు మారుగా హాలేశ్వరుడు అని చదివినారు. ఇప్పుడు గణేశ్వరాలయము జాడ కూడా లేదు. ఒక గణేశ్వర సుందరవిగ్రహముమాత్రము ఊరిబయటి పొలములోపడియున్నది. దానివద్దనే ఈ శాసనముండుటచే ఆగణేశ్వరుని అంగరంగభోగాలకే ఈ శాసన మేర్పడెను. (తె. శా. పుట ౧౨౪)

(౪) త్రిభువనమల్లునికాలములో చాళుక్యవిక్రమశకము ౪౧ వ సంవత్సరములో భీమ అరసు గంగాదేవి అనువారు "గంగేశ్వర ధూపదీపనివేద్యములకు" దానములు చేసిన శాసనము. (తె. శా. పుట ౧౩౨)

ఈ శాసనములో కోడూరు పేర్కొనబడినది. ఇది మహబూబునగరు ప్రక్కస్టేషను గ్రామము. ఈ శాసనము గంగాపురములో కానరాదు. అచ్చటిది కాదనియు తోస్తున్నది. ఇందు "కొట్టిపాక" పేరు గలదు. ఇప్పటి కొలనుపాకను పూర్వశాసనాలలో కొట్టిపాక యనియు, కొల్లిపాక యనియు, కొళ్ళియపాక యనియు పేర్కొనినారు.

(౫) భూలోకమల్లుడు కళ్యాణిలో రాజ్యముచేసేకాలములో అతని దండనాయకుడగు తైలపదేవుడును, మరికొందరు సెట్లును

సోమనాథదేవుని నందదీపాని కిచ్చిన దానమును తెలుపు శాస నము. (తె.శా. పుటలు ౧౪౪-౧౪౫)

(౧౦) వెన్నరాజు అను తురీయజాతిరాజువంశమువా రెవ్వరో ఏదో దానము చేసినట్లు తెలుపు శాసనము. ఇది అసంపూర్ణముగా ముద్రితము. (తె. శా. పుటలు ౧౪౯-౧౫౦)

(౧౧) త్రైలోక్యమల్లునికాలములో మల్హాణదేవి భీమేశ్వర దేవుని కిచ్చిన దానధర్మమును తెలుపు శాసనము. ఇది గంగా పురములోని నంబులకుంట అను కుంటపై కలదు. (తె. శా. పుట ౧౧౧)

ఇవి లక్ష్మణరాయ పరిశోధకమండలి(హైదరాబాదువారు) ప్రకటించిన తెలంగాణా శాసనములలో ముద్రితమైన శాసనముల నుండి తెలియవచ్చు సంగతులు. గంగాపురమునకు రెండు మూడు మైళ్ళ దూరములోనున్న రెండు మూడు గ్రామాలలో నసురుల్లాబాదునందును, కిష్టారములోను శాసనాలు కలవు. ఆ శాసనాల నింకను ఎవ్వరును సేకరించలేదు. అవియు ఈ చరిత్రకు సహాయపడునట్టివి.

ఇప్పుడు మనకు లభించిన శాసనములు పశ్చిమచాళుక్యు లలో ముగ్గురు రాజుల కాలమునాటివి. అవన్నియు క్రీ. శ. ౧౦౭౯ నుండి ఇంచుమించు క్రీ.శ. ౧౧౪౦ లోపలివై యున్నవి. కళ్యాణి చాళుక్యవంశము క్రీ. శ. ౧౧౮౯ లో అంతరించెను.

## కవి తెలిపిన చాళుక్యరాజులు

మల్లారెడ్డికవి తన గంగాపురమహాత్మ్యమునందు చాళుక్య రాజులు గంగాపుర దేవాలయముల నుద్ధరించినవారని తెలిపి

నాడు, వారిని గురించి అతడు వ్రాసిన పద్యాలభావ మేమనగా- చాళుక్యరాజులలో వీరగంబాళుడనియు (పుట ౭౦ పద్యము ౨౬౮) వీరహాంబాళుడనియు(పుట౮౨) పేరుగల ఒక మహారాజుండెను. అతనికి జగదేకమల్లుడు, త్రిభువనమల్లుడు, చాళుక్యమల్లుడు అను కుమారు లుండిరి. వారు ఈ గంగాపురాలయములను ఉద్ధరించిరి.

కవి తెలిపిన యీవిషయములలో వ్యత్యాసమున్నది. చరిత్ర ప్రకారము త్రిభువనమల్లుడు మొదట నుండినరాజు, ఆతని తర్వాతవాడు భువనైకమల్లుడు చాళుక్యమల్లుడు అను పేరుగల రాజు లేడు. వీరహాంబాళునికి పేర్మాదియనియుఆరవసోమేశ్వరుడు అనియు పేరులుండెను. ఈహాంబాళు తుదివాడు. త్రిభువనమల్లుడే ఆరవ చాళుక్య విక్రమాదిత్యుడు. అతడు క్రీ. శ. ౧౦౭౬ నుండి రాజ్యముచేసెను. ఆతని చరిత్రకే బిల్హణుడు విక్రమాంక దేవచరితము అను కావ్యముగా రచించెను. త్రిభువన మల్లుని తర్వాత మూడవ సోమేశ్వరుడును, అతని తర్వాత జగదేకమల్లుడును రాజ్యముచేసిరి. ఇతడు క్రీ. శ. ౧౧౩౮ లో రాజ్యముచేసెను. హాంబాళుడు క్రీ. శ. ౧౧౭౨ తర్వాతిరాజు. ఈ కాలములోనే పశ్చిమ చాళుక్యరాజుల చరిత్ర తెలిసినవారరుదు.కవికాలములో తెలియకుండుట చిత్రముకాదు.

## నరపతి విజయములో గంగాపురము.

అందుగల వెంగయ్యఅను కవి నరపతివిజయమను నామాంతరము గల రామరాజీయము అను గ్రంథమును పద్యములలో వ్రాసెను. అది కేవలము చరిత్రగానే వంశావళులతో, బిరుదగద్యాలతో నింపి వ్రాయబడినది. వెంగయ్యకవి అళియరామ రాజు సమకాలికుడు. కావున అతని చరిత్ర తల్లికోట యుద్ధము

నకు పూర్వమే వ్రాయబడిన క్రీ.శ. ౧౫౬౦ ప్రాంతపు కావ్యము. అతడిట్లు వ్రాసెను.

"నందమహీ మండలేశ్వరునకు తొమ్మిదవవాడై చాళుక్య భూపాలు డుదయించె.

తే. "ఆ చళుక్య వంశజులైనట్టి నృపతు
లవని పెక్కేండ్రు పాలించిరంత, ఆ కు
లాంబునిధి శశియగా, బిజ్జలాఖ్యనృపతి
పుట్టిధర నేలె, వైరుల మట్టుపెట్టి".

ఇచ్చట కొంత సవరణ అవసరము. బిజ్జలుడు చాళుక్యుడు కాడు. చాళుక్యరాజద్రోహి. చాళుక్యరాజగు మూడవ తైలపుని అనగా జగదేకమల్లుని కుమారుని సేనానిగానుండి ద్రోహియై యారాజును తొలగించి బిజ్జలుడు తానే రాజయ్యెను. అతనికుమారుడు మురారిసోమేశ్వరుడు భుజబలమల్ల అను బిరుదమువహించి రాజ్యము చేసెను. చాళుక్య తైలపుని కుమారుడు నాల్గవసోమేశ్వరుడు భుజబలమల్లుని అనగా మురారిసోమేశ్వరుని తరిమివేసి మరల తనపెద్దల రాజ్యమును సంపాదించుకొని పరిపాలించెను. ఈ నాల్గవ సోమేశ్వరుని కొడుకే పేర్మాడిరాయడు. ఇతనినే కన్నడములో హాంబాళిరాయడనిరి.

వెంగయ్యకవి మరియు నిట్లు వర్ణించెను.

తే. " అని పొగడ్తకు నెక్కె కళ్యాణబిజ్జ
శక్షితీశుడా రాజ లలామునకును
మనుమడైనట్టి వీరహొమ్మాళి రాయ
డవని పాలించె సకలజనాళి మెచ్చ".

ఇందును తప్పేకలదు. బిజ్జలుని కొడుకుపేరు మురారి సోమేశ్వరుడు. మరి వీరహొంమ్మాళిరాయడో మూడవ త్రైలపుని మనుమడు. నాల్గవసోమేశ్వరుని కొడుకు. ఈ వీరహొంమ్మాళిరాయనే మల్లారెడ్డికవి పేర్కొనెను. ఈ హొంమ్మాళిరాయడు స్వయముగా గంగాపురమునకు వెళ్ళినట్లు వెంగయ్యా తన నరపతివిజయములో ఇట్లు వ్రాసినాడు.

"ఆవీర హొంమ్మాళి రాయమహీపాలుం డొక్కనాడు నూరువేల రథంబులు, లక్షయేనుంగులు, అన్ని గుర్రంబులు, శతసహస్రాయుత పదాతివర్గంబును, గొలిచిరా జయదుందుభి స్వన ప్రకుపితాచలకంధరకంఠీరవుండై సర్వాలంకృతాభిరామంబై, సకల సంపదల కునికి పట్టై, పరమభాగవత జనాకీర్ణంబై, పరాభేద్యంబై, వీరనారాయణ దేవనివాసంబై, యొప్పు గంగాపురాఖ్యాకు, ప్రతి నామంబుగల మాయాపురంబున కరుదెంచి, పౌరులెదురుకొన, రాజగృహంబుం బ్రవేశించి, యుచిత కరణీయంబు లొనరించి, యారాత్రి సుఖనిద్రజెంది, మరునాడరుణోదయంబున, స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లొనర్చి, మున్నుతనచేత ప్రతిష్ఠచేయబడిన చెన్నకేశవ స్వామిదేవలయంబున కరిగి, యద్దేవునకు - - - - నమస్కారంబు లాచరించి - - - - పెద్దలగు బ్రాహ్మణులువెంటరా, తన్మధ్యంబున దనుకేశంబున కొర్చి, ప్రదక్షిణం బొనరించునెడ, ప్రదక్షిణ ప్రదక్షిణంబునకు గరుడ స్తంభోపకంఠ భూమి నుదురంట సాష్టాంగ దండప్రణామంబొనర్చి, ఆ వీర హొంమ్మాళి రాయ మహీమండలాఖండలుండు, నిజ పురంబున కరుదెంచి - - - - పెద్దకాలంబు ధాత్రిబాలించుచుండె - - - -

"ఆమహారాజునకు సుతుడైన తాత
పిన్నమహీశ్వరేశ్వరుడు పృథివినేలె"

వెంగయ్యకవివ్రాసినతర్వాత వంశక్రమసంగ్రహ మిట్లున్నది. తాత పిన్నరాజుకొడుకు సోమదేవుడు, అతని కొడుకు రాఘువేంద్రుడు, అతని కొడుకు పిన్నశౌరి, అతని కొడుకు బుక్కరాజు. ఆ బుక్కరాజు వంశమువాడే అళియ రామరాజు. ఈ విధముగా తూర్పు చాళుక్యులవలె మళ్ళీ కర్ణాట పశ్చిమ చాళుక్య వంశము ఆంధ్ర వంశముగా మారిపోయెను.

వెంగయ్యను మళ్ళీ ఒకమారు సవరింపవలసి వచ్చినది. వీర హొంబాళుడే గంగాపుర కేశవాలయమును కట్టించెననియు, ఆ హొంబాళుడే గంగాపురానికి వెళ్ళియుండె ననియు, అందు చాళుక్యరాజుల భవనాలుండె ననియు, తెలిపినాడు. ఇప్పుడు చాళుక్యరాజుల భవనాల జాడ ఏమియు గంగాపురములో కాన వచ్చుట లేదు. అవి యుండిన స్థలముజాడకూడా లేదు.

గంగాపుర మింకేదైనా రెండవస్థలమైయుండు ననుటకు వీలులేకుండా మాయాపురమను ప్రతినామముగల గ్రామమని కవి వర్ణించుటచేత సందేహానికి తావేలేదు. స్థలపురాణములోను, మల్లారెడ్డి కావ్యమువల్లను, గంగాపురానికి మాయాపురియను రెండవపేరుండెనని తెలిసినది.

కల్యాణరాజులలో తుదివాడగు వీరహొమ్మాళిరాయుడు గంగాపుర కేశవాలయమును నిర్మించెనని వెంగయ్య వ్రాసెను. "మున్ను తనచే ప్రతిష్ఠచేయబడిన కేశవస్వామి దేవాలయమున కరిగి" అని వర్ణించెను. కాని యింతకుముందే యుదాహరించిన

శాసనములలో జగదేకమల్లుడు అతని తనయుడగు త్రైలోక్య మల్లుడు గంగాపురమున "కేశవస్వామి"కి దానములు చేసినట్లు తెలపినారు.

"జగదేకమల్ల - - తనయరు - - సోమగ్రహణసంక్రి
మణవెతిపాతనిమిత్తదాదు శ్రీమత్త్రైలోక్యమల్ల
కేసవ దేవపురదాగయు మళిగెయకొట్ట

(తె. శా. పుట ౧౦౮)

"త్రైలోక్యమల్ల శ్రీ కేశవపురద" (తె. శా. పుట ౧౨౪)
"త్రిలోక్యమల్ల కేసవపురద" (తె. శా. పుట ౧౨౫)

పై శాసనోదాహరణత్రయమునుబట్టి జగదేకమల్లుని కాలములోను, త్రైలోక్యమల్లునికాలములోను అనగా వీరహోంబాళునికంటె ముందుకాలములోనే కేశవాలయము నిర్మింపబడియుండె ననుట స్పష్టమే. బహుశా జగదేకమల్లుని తండ్రియగు తైలపుని కాలములో కేశవాలయము నిర్మితమై యుండును. చాళుక్యులు వీరశైవులు. కావున అంతకంటే పూర్వకాలములో వారు వైష్ణవాలయమును కట్టించియుండరు. మూడవతైలపుని కాలమునుండి చాళుక్యులు వైష్ణవాభిమానులుగా మారుచు (పేర్మాడి)వీరహోమ్మాళుని కాలమువరకు వారు వీరవైష్ణవులై పోయిరి. వెంగయ్య హోంబాళుని వైష్ణవభక్తినివర్ణించ నీభాగ మీయూహ కాధారమగుచున్నది. పశ్చిమచాళుక్య వంశములోనివాడే విజయనగర స్థాపకుడగు బుక్కరాయలనియు, అతని వంశమువాడే ఆర్వీటి రామరాయలనియు వెంగయ్య తెలిపిన విషయము విజయనగర చరిత్రకు చాలా సహాయకారి యగునట్టిది. ఈ విధముగా గంగాపురము చాలా ప్రాచీనస్థలమనియు చాలా ప్రసిద్ధివహించి యుండినట్టిదనియు, పూర్వ కావ్య శాసనములవలన వెల్లడియగుచున్నది.

## మల్లారెడ్డి తెలిపిన స్థానిక విషయములు

మాహాత్మ్యముల నేరీతిగా వ్రాయవలెనో ఆ రీతిగా మల్లారెడ్డి గంగాపుర మాహాత్మ్యమును వ్రాసినాడు. గంగాపురమును గూర్చిన మహత్త్వవిశేషములు స్కాందపురాణములోని తీర్థఖండమందు కలదని కవి ఆదిలోనే తెలిపినాడు. భారతదేశములోని తీర్థస్థలాలకు పుట్టినిల్లు స్కాందపురాణము. అది యీనాటికిని పెరుగుతునే యున్నది. ఏ స్థలమైనా ఎక్కువగా భక్తుల నాకర్షించినచో ఎవ్వరైనా పనిలేనివారు సంస్కృతములో ఆ స్థలమాహాత్మ్యమును గురించి కథలు కల్లలు వ్రాయించియుంచి అది స్కాందపురాణాంతర్గతమంటే సరిపోతుంది. గంగాపురము కృతయుగములో మత్స్యపురమని, త్రేతాయుగములో దురితకోలాహలమని, ద్వాపరములో మాయాపురమని, ఈ కలియుగములో గంగాపురమని ప్రసిద్ధి వహించెనని కవి వర్ణించినాడు(౧ ఆశ్వాసము ౬౦ పద్యము) ఆ పేరులు వచ్చుటకు గల కథలను కూడా వర్ణించినాడు.

దేవసేన అనునది గంగాపురము వద్దకలదనియు దానిమధ్యభాగమును మీనాంబర మనిరనియు తెలిపినాడు (పుట ౩౭)

మీనాంబరమను పేరులో మీనముకలదు కాన దాని నాధారము చేసుకొని స్థలపురాణములో ఒకకథను కల్పించినాడు. పూర్వము నలచక్రవర్తి జూదమాడి యోడి దమయంతీసహితుడై మీనాంబరీ తీరమందు విడిదిచేసి ఆకలిగొని మీనాంబరమందు చేపలుపట్టి భార్యచేవాటిని వండించెను. పక్వమైన మీనములు పాత్రనుండి యెగిరి మీనాంబరీ నీరములో కలిసిపోయెనట. అప్పటినుండియే దేవసేననదికి మీనాంబరమను పేరువచ్చెనట!

గంగాపురములో గొల్లత్తగుళ్ళు కలవంటిమిగదా. కవి గంగాధరుని కృష్ణునివలె గొల్ల పడుచులవెంట దగిలించి దానికి తగినట్టి శృంగార రసమును విస్తరించెను. "శివుడొకనాడు కేశవుని

శ్రీచరణాబ్జము లర్థిగొల్వవచ్చి" గొల్ల పడుచుల నిద్దరిని చూచె నట. వారి పేర్లు ఇంగెమ, తంగెమ, అట! వారు ప్రతిదినముమంద లకు పోయి పాలు తెచ్చుచుండిరి. వారినిచూచి "మన్మథాయత్త చిత్తుండై నమ్మహాదేవుండు తనచిత్తంబున నా గొల్లపల్లవాధరల యుల్లంబులపల్లవింపజేయు" "మిండ జంగమ వేషంబుమెండుకొనగ, సతులముందర గనుపట్టె శంభుడపుడు" వారితో సరసాలాడి "వారితో నసమశర సమర విహారంబుల లీలందేలి" వారికి తాను మీనాంబరీతీరమున పరుస వేది లింగమై యుందుననియు అచ్చట వారు దినమువచ్చి తనను పొంది ఇనుముకడవల బంగారుకడవలుగా మార్చుమని తమపేర దేవళముకట్టుడని వారితో చెప్పెనట. వారును అట్లేచేసిరి. అవి గొల్లెతగుళ్ళని పేర్వడసెను. అవే గొల్లత్త గుళ్ళయ్యెను.

ఈ కథయంతయు కల్పితమేయని చెప్పవచ్చును.

గండకాద్రి అనుచోటికి వీరహాంబాళుడు వెళ్ళెననియు అందు కేశవస్వామి కనుపించెననియు ఆ విగ్రహాన్ని తెచ్చుటకై ప్రయత్నించగా అచ్చటి రాజగు వీరసేనుడనువాడు అనుమతించ లేదనియు తుదకు సూర్యునారాధించి సంతోషపెట్టి వీరసేనుని అనుమతితో గంగాపురమునకు కేశవమూర్తిని తెచ్చి ప్రతిష్ఠించె ననియు వీరసేనుని కూతురగు పద్మావతిని పెండ్లాడెననియు కవి చతుర్థాశ్వాసములో వర్ణించినాడు. వివాహసందేశ మంపిన వరకే గ్రంథము లభించినది. తర్వాతభాగము శిథిలమై లభ్యముకాలేదు. ఈ కావ్యము నాల్గు ఆశ్వాసములదై యుండును. గండకాద్రి యెచ్చటిదో వీరసేను డెవ్వడో యేమో తెలుపజాలము. గ్రంథ పాతమైన భాగములో ఇంకేమి చారిత్రక పౌరాణిక గాథలుండి నవో యేమో లభించినంతవరకు మనకు తెలియవచ్చిన విషయము లివియే.

కవికాలము-వంశము.

ఇక చారిత్రక విషయములను వదలి మల్లారెడ్డిని గురించి అతని కాలమును గూర్చి వంశమును గూర్చి అతని కావ్యమును గురించి యించుక తెలిసికొన వలెను.

మల్లారెడ్డి తన వంశమునుగురించి యిట్లు వ్రాసెను. అతని యింటిపేరు రెడ్డిరెడ్డి లేక రెడ్డి. అతని గోత్రము ప్రోల్యాల గోత్రము. అతడు "మోటవాడ వంశ వారాశిజనిత కైరవమిత్రుడు" రెడ్ల శాఖలలో మోటాటి అను శాఖ ముఖ్యమైనశాఖ. దాని నిప్పుడు మోటాటి అనుచున్నారు. కాని ౨౦౦ ఏండ్ల క్రిందట తిమ్మారెడ్డికవి తన ఆంధ్రీకృతానర్ఘ రాఘవ కావ్యములో తాను మటెవాడ శాఖకాపునని వ్రాసుకొనెను. తద్వంశీయు లిప్పటికినీ కలరు. వారు మోటాటి శాఖవారే. తిమ్మారెడ్డి వంశమువారు తమ బంధువులకిచ్చిన దానపత్రాలలోను మటెవాడ అనియే కలదు. మరి యీ మల్లారెడ్డి మోటవాడ అనుపదమును వాడినాడు. కావున మోటాటి అను పదము పూర్వము మటెవాడగా నుండెనని తెలియ రాగలదు. పూర్వము ఓరుగంటి సామ్రాజ్య కాలములో మటెవాడ సీమ ప్రధానసీమగా నుండెను. ఆ మండలములోని రెడ్లందరును మటెవాడ కాపులుగా పరిగణింపబడిరి. ఆ పదమే తుదకు మోటాటిగా అపభ్రంశ రూపమందెను. అయితే ఆకాలములో సీమభేదములచే మటెవాడ రెడ్లు, పాకనాటిరెడ్లు, పంటి రెడ్లు, రేనాటిరెడ్లు, పలనాటిరెడ్లు అని, నానావిధాలుగా చీలినను పూర్వకాలములో పరస్పర బాంధవ్యములు బహుకాలము వరకుండినట్లు కానవచ్చుచున్నది. ప్రోల్యాల గోత్రమువారు మటెవాడ (మోటాటి) రెడ్లలోనే లేకుండిరి. పంటిరెడ్లలోను ప్రోల్యాల గోత్రము వారు కానవస్తున్నారు. శా. శ. ౧౩౯౮ నాటి రాజమహేంద్రవరము నేలిన అల్లయ వేమారెడ్డి శాసన మొకదానిలో

ఇట్లున్నది. "పంటకులములో పాశిల్వాల గోత్రోద్భవుడైన దొడ్డ నరేంద్రుడు జన్మించెను". ఆదేశాసనములో పంటిరెడ్లు చోడరాజులతోను విజయనగర చక్రవర్తులతో బాంధవ్యము చేసినట్లు తెలిపినారు. (చూడుడు ఎపిగ్రాఫికా ఇండికా జనవరి ౧౯౧౬) పైశాసనాన్ని బట్టి రెడ్లు చోడులతోను, విజయనగర చక్రవర్తులతోను బాంధవ్యాలు చేసినప్పుడు తమలోని అంతశ్శాఖలలో విభిన్నత యుండెనని చెప్పుటకు వీలులేదు. ఒకే గోత్రమువారు సీమభేదములను బట్టి పంటకాపులుగాను, పాకనాటివారుగాను, మోటాటివారుగాను వేరైపోయిరనుటలో విచిత్రమేమియులేదు.

మల్లారెడ్డి ఎప్పటివాడనునది నిర్ణయించవలెను. మల్లారెడ్డి తన వంశమును గురించి యిట్లు తెలిపినాడు.




తన తాత పర్వతరెడ్డి. పర్వతరెడ్డి అన్న మల్లారెడ్డి అతన్ని గురించి యిట్లు వ్రాసెను

"ప్రోల్వాలగోత్ర సంపూర్ణాబ్ధిచంద్రుండు
మల్లభూనాథుండు మాన్యయశుండు

అందలంబును తక్షీపు లందుకొనుచు
సరస బూర్గులపట్టణ చౌధరగుచు
ప్రజల బాలించె భూభుజుల్ ప్రస్తుతింప.

(౧ ఆశ్వాసము ప ౧౭ పుట ౬)

దీనినిబట్టి మల్లారెడ్డి పెదతాత ఖుతుబుషాహా కాలములోని వాడని స్పష్టము. కాని ఖుతుబుషాహా లెందరో కలరు. ఖులీ ఖుతుబ్‌షా మొదటివాడు. క్రీ. శ. ౧౫౧౨ లో రాజ్యము చేసెను. అబుల్‌హసన్ తానీషా తుదివాడు. క్రీ. శ. ౧౬౮౭ లో రాజ్యభ్రష్టుడయ్యెను. కావున క్రీ. శ. ౧౫౧౨నుండి ౧౬౮౭లోగా యీ కవి తాత యుండెననుట నిర్వివాదవిషయము. కవి తనకన్న పూర్వులగు తెనుగు కవులను స్మరించినాడు. అందు బమ్మెర పోతన తుదివాడు. కుతుబుషాహీల రాజ్యమేర్పడకమున్నే పోతన యుండెను. కాన అది మనకు కవికాలనిర్ణయాని కుపయోగించదు.

కవి తాత బూర్గులపట్టణ చౌధరిగా నుండెనన్నాడు. మరొక చోట కవి తండ్రి బూర్గులపట్టణ దేశాయిగా నుండెనని వ్రాసెను. (పుట ౧౪) చౌధరి, దేశాయి శబ్దాలు కొంతవరకు కాలనిర్ణయా నికి సహాయపడును. చౌధరి, దేశాయి, దేశముఖు అను శబ్దాలను మహారాష్ట్రులు సృష్టించినట్టివారు. భూమ్యాదాయములను వసూలుచేసి యిచ్చువారికీ బిరుదు లుండెను. చౌధరి అను పదము చౌథ్‌వారి అనగా చౌథ్ వసూలుచేయువాడు అని యర్థము. మహారాష్ట్రులు భూఫలితములలో నాల్గవభాగాన్ని పన్నుగా తీసుకొను చుండిరి. చతుర్థశబ్దమే చౌథ్ అయ్యెను. ఈ చౌథ్ ఆచారము శివాజీకులమున కించుక ముందు వచ్చెనందురు. శివాజీ క్రీ. శ. ౧౬౨౭ నుండి ౧౬౮౦ వరకు జీవించియుండినవాడు. చౌదరి, చౌదరితనము అను పదాలు పాలలేకరికదిరీపతి వ్రాసిన శుకసప్తతిలో కానవస్తున్నవి. అతనికాలమువరకే తెనుగుదేశములోని గ్రామాధికారులు చౌధరులు లేక చౌదరులు అయియుండిరి. కదిరీపతి తాత క్రీ. శ. ౧౫౭౨-౧౫౮౫ నాటి శ్రీరంగరాయలకాలము

వాడు. కాన కదిరీపతి క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతమువాడు. "ఇంగిలీషుల మొఖాములను" కదిరీపతి వర్ణించినాడు. కావున చౌదరి శబ్దము ౧౬౦౦ క్రీ. శ. నాటిదగును. అనగా శివాజీకన్న ముందు కాలములో మహారాష్ట్రుల ప్రాబల్యముండినచోట అది ప్రారంభమయ్యెను. ఈ లెక్క చొప్పున మల్లారెడ్డి తాత క్రీ. శ. ౧౬౦౦-౧౬౫౦ ప్రాంతమువాడనియు, మల్లారెడ్డి క్రీ. శ. ౧౬౫౦-౧౭౦౦ ప్రాంతమువాడనియు నిర్ణయిస్తే ఏ ౫౦ ఏండ్ల తేడానో యుండును. అంతకంటే మించిన పొరపాటుండదని చెప్పవచ్చును.

## మల్లారెడ్డి కవిత.

ఇతనికవితచక్కని ధారాశుద్ధి కలిగినట్టిది. శైలిసరళమైనది. పద్యాల నడక ఎందునూ కుంటువడలేదు. మాకుదొరికిన ప్రతిని వ్రాసిన లేఖకుడు చాలాతప్పులు వ్రాసినాడు. అందుచేత కవి యొక్క సరియగు శైలి కొన్నితావులయందు సరిగా లభించినది కాదు. పైగా తాళపత్రపుటలలో నాల్గవ ఆశ్వాసములో చాలా భాగము శిథిలమై లభించినదికాదు. ప్రత్యంతరము ప్రయత్నించినను లభించలేదు. ఈప్రతికూడా శ్రీ శేషాద్రిరమణ కవులలో వున్నవారగు శ్రీమాన్ దూపాటి వెంకటరమాణాచారిగారి వద్ద లభించినది. వారిని ఈప్రతి సంపుటకై కోరగా "ఇది చక్కనిశైలి ముద్రణయోగ్యమైనది" అని వ్రాసిపంపిరి. ఈప్రతిని ఆచార్యుల వారికి మల్లెపల్లిలో అనగా మల్లారెడ్డి తాతయుండిన గ్రామములో లభించినది, ప్రత్యంతరమునకై వేచియుందమన్న మామిత్రులును ఇప్పుడు కీర్తిశేషులైన వారునగు శ్రీ ఆర్. దామోదరరెడ్డి బి. ఏ., బారిస్టరుగారు మమ్ముదాని నెత్తి వ్రాయించుటకును ముద్రించుటకును పలుమారు తొందరపెట్టసాగిరి. వారు చనిపోవుటకుముందు దీనినెత్తి వ్రాయించితిమి. అంతలో వారు కీర్తికాయులైరి. అందుచేత దీనిని త్వరగా ముద్రించుట మరింత అవసరమయ్యెను.

మల్లారెడ్డి అందందు వ్యాకరణ విరుద్ధమగు ప్రయోగములను ప్రయోగించెను. అవి తెలియక కాదు. శక్తి చాలక కాదు.

ఉద్దేశాపూర్వకముగానే అతడు ప్రయోగించినట్లు కానవచ్చును.

"వరుసతోనవ్య కీర్తిలత - - - - (పుట-౮)

"వేగంబున నేగనంతనొక తాతన్విన్విలోకించి

(పుట-౭౨)

"అన్నమరుచయ్యె (అరుచి+అయ్యె) (పు-౬౭)

ఇట్టివిచాలా అరుదు. ఇతని వర్ణనలన్నియు ప్రబంధకవుల పద్ధతిలోనే యున్నవి. పురవర్ణన, స్త్రీ వర్ణన, విరహ తాపము, మున్నగునవన్నియు మధ్యకాలపు ప్రబంధకవులు వర్ణించినట్లుగా వర్ణించినాడు. మల్లారెడ్డి శైలిని తెలుపుటకై రెండుపద్యములుదహరింతుము.

శా. కాలవ్యాధుడు వెంటనంటి తరుమన్ గంజాప్త సారంగమున్
చాలందవ్వగనేగ తీవ్రశరమున్ సంధించి బిట్టేయన
ట్లోలింబశ్చిమ వార్ధి వ్రాలుటనులీ యుగ్రాంశుడుగ్రుండె, ద
త్కాలాలంబన సాంధ్యరాగమమరెన్ గెంపెక్కి నల్దిక్కులన్.

చ. శివుతల మెట్టి, ఫుల్లసరసీరుహ సంపదకొల్లబెట్టి, కై
రవములవన్నె బెట్టి, భ్రమరంబుల బందికి బెట్టి, జారిణీ
యువతులమొట్టి, కోకములరొద్దికలెల్లను సానబట్టి. యు
త్సవమున చంద్రమండలము సయ్యనదోచెను తూర్పుదిక్కునన్.

ఇట్టిచక్కని కావ్యము శైథిల్యమొంది ప్రత్యంతరము దొరకక పోవుట విచారకరము. ఉన్నంతవరకైనను ముద్రించుట ఉన్నదానిని పోగొట్టుకొనకుండుటయును.

## మల్లారెడ్డి వంశము

కవి మల్లారెడ్డి వంశీయులు రెడ్డెడ్డి వంశమువారును ప్రొల్యాల గోత్రమువారును నైయున్నారు. వారందరును పాలమూరు జిల్లాలో వివిధ గ్రామాలలో వ్యాపించినారు. మల్లారెడ్డి తాత బూర్గుల దేశాయిగా చౌదరిగా యుండినట్లు తెలిపినాడు. బూర్గుల గ్రామము గంగాపురమునకు మూడునాలుగు మైళ్ళదూరములో నున్నది. అందుచేత మల్లారెడ్డికి గంగాపురమునుగూర్చి వ్రాయుట

కాసక్తి కలిగియుండును. మల్లారెడ్డితండ్రి "మల్లపల్లి పురమందిర నివాసుండు" అని వ్రాసెను. మల్లపల్లి గ్రామముకూడా గంగా పురమునకు సమీపముననున్నది. మల్లారెడ్డి తనకు నలుగురు కుమారులని యిట్లు తెలుపుచున్నాడు.

ధీరులు మత్పుత్రులు, రం
గారెడ్డియు, హేమవిభుడు, ఘనుడగు శ్రీల
క్కారెడ్డియు, బక్కధన్యుడు
సారస్యుడు, నల్వురమిత శాంతగుణాఢ్యుల్.

ఈనలుగురు నాలుగు శాఖలై వివిధప్రాంతములకు వెళ్ళిరి.

(౧) రంగారెడ్డిగారు. మల్లెపల్లి వతనకు వెళ్ళెను
(౨) హేమారెడ్డిగారు. కుచ్చరకల్లు పెద్దాయపల్లి వతనకు వెళ్ళెను
(౩) లక్కారెడ్డిగారు. నాగరకండనూలు వతనకు వెళ్ళెను
(౪) బక్కారెడ్డిగారు. కోడుగంటి వతనకు వెళ్ళెను.

## స్మృతి.

ఈ గ్రంథ ముద్రణకు ముఖ్యకారకులు కీర్తికాయులగు శ్రీ ఆర్. దామోదరరెడ్డిగారు. ఇట్టి గ్రంథ మున్నదని విని మా ద్వారా శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యులవారివద్దనుండి తెప్పించి యెత్తి వ్రాయించి ముద్రించుటకై తొందర పెట్టుచునే యుండెను. అంతలో దామోదరరెడ్డిగారు అకాలమృత్యువువాతబడి బంధుమిత్రులకు శోకమునే మిగిలించిపోయిరి. వారు మల్లారెడ్డి వంశీయులు. శ్రీ.గ. రామకృష్ణారెడ్డిగారి అన్నకుమారులు. అయితే తమ వంశీయులను అభిమానముచే ముద్రించుటకై కోరియుండ లేదు. కవిత బాగున్నదా అని విచారించగా చక్కని మృదుమధుర శైలితో కూడినదని చెప్పగా ఆప్తవాక్యమును ప్రమాణముగా గొని గ్రంథముద్రణకై అభిలషించియుండిరి.

కీ. శే. దామోదరరెడ్డిగారు మాకు పరమమిత్రులు. అట్టి మిత్రులు అరుదుగా లభింతురు. వారు సదా ప్రసన్నులు. హాస

న్ముఖులు. ప్రజాహితకార్యాలలో చాల అభిమానముకలవారు. వారికి శత్రువులే లేకుండిరి. కోపమెట్టిదో యెరుగరు. ఎన్నడైనా చాలా కోపమువచ్చినా అది చీదరింపుగా ఉండి కొన్ని నిముషాల లోనె అదియు అంతరించిపోయెడిది. చేతనైనంతవరకు ఉపకారమే చేసిరి కాని ఎవ్వరికినీ అపకారము చేసియెరుగరు. నిగర్వులున్నూ సౌమ్యులును సుముఖులును ప్రీతిపాత్రులును నైయుండిరి. రాజబంధువులైనను, గొప్పఉద్యోగమందుండినను అందరితో కలసి మెలసి తిరుగుటనుచూచి వారి నెరింగినవారందరును వారి సౌలభ్య శీలమునకు, మితజీవనమునకు, నిరాడంబరతకు ఆశ్చర్యపడుచుండిరి. వారి అకాలమృతికై వారి మిత్రులలో కంటతడిబెట్టని వారులేరు. నాకు వారు బాల్యమిత్రులు. క్రీ. శ. ౧౯౧౬ లో వారి మైత్రి లభించెను. వారు చనిపోవునాటివరకు ఆ మైత్రిలో ఎన్నడును ఆవంతయు భంగముకలుగక దినదినాభివృద్ధిగానుండెను. హైద్రాబాదునగరములో వారు నేను కలవనిదినములు చాలా తక్కువ. వారిని ఏవిధముగానైనను మరచిపోజాలను. ఇది ఒక వ్యక్తివిశిష్టతయేకాదు. వారి మిత్రులందరికినీ ఇదే అనుభవము కలదు. ఇట్టి ఉత్తమమిత్రుని స్మరణకై యీ గ్రంథమును ప్రకటించుచున్నాము. వారి స్మారకమునకు ఇది నాంది యగుగాక. ఇట్టివెన్నియో ప్రచురించి వారియెడల వారి బంధువులును, మిత్రులును తమ ధర్మాన్ని నెరవేర్తురుగాక.

కీ. శే. దామోదరరెడ్డిగారు ౨౭ జనవరి ౧౯౦౦ నాడు జన్మించిరి. రెడ్డివంశమువారు వనపర్తిరాజబంధువులు. దామోదరరెడ్డిగారి తల్లియు శ్రీమంతు మహారాజా రామేశ్వరరావు బహద్దరు వనపర్తిరాజాగారి భార్యయు అక్కసెల్లెండ్రు, దామోదరరెడ్డిగారి బాల్యము, విద్యాభ్యాసము, వనపర్తిలో జరిగెను. వారికి ఉర్దూ ఫార్సీ ఇంగ్లీషు విద్యలనే బాగా చెప్పించిరి. తర్వాత హైద్రాబాదులో ఉన్నతవిద్యనభ్యసించి పూనాలో రెండేండ్లు చదివి తర్వాత బారట్లా నభ్యసించుటకు ఇంగ్లండు వెళ్ళిరి. అక్కడ

నాలుగేండ్లుండి బి. ఏ., పట్టమును బారిష్టరు పట్టమును పొంది తిరిగి హైద్రాబాదుకు వచ్చి కొంతకాలము వకాలతుచేసి తర్వాత హైకోర్టులో సర్కారీవకీలుగా నియుక్తులైరి. ప్రథమమున అసిస్టెంట్ కౌన్సిల్ గా ఉండి తర్వాత చీఫ్ కౌన్సిల్ గా నియుక్తులైరి. చని పోవునాటికి వారికి ౨౦౦ రూపాయీల జీతము లభించుచుండెను. వారు కోరియుండిన జిల్లాజడ్జి పదవి యెన్నడో లభించియుండెడిది. కాని ఇదే నాకు బాగున్నది. ఈ వాతావరణములో ఉద్యోగము అభిలషించను అనేవారు. చనిపోవుటకుముందు వారికి సెషన్ జడ్జి పదవిని ఇచ్చువారై యుండిరి. కాని దైవ సంకల్ప మన్యథా యయ్యెను. వారికి గొంతుజబ్బు కలిగెను. ధ్వని పెకలకున్నను అట్లే సెలవైనకోరక మూడు నెలలు పనిచేసిరి. తుదకు డాక్టర్ల ప్రోద్బలముచే మైసూరుకు చికిత్సకై వెళ్లిరి. అచ్చట బాగగుచున్న దనియే వార్తలువచ్చుచుండెను. తటాలున ఒకదినము సాయంకాలము వారి కాయాసమధికమయ్యెను. అంతవరకు సుఖముగానుండిన వారు. ౧౫ నిముషాలలో చెమటలుపోసి చనిపోయిరి. వారు ౧౬ మార్చి ౧౯౪౫ నాడు మైసూరులో చనిపోయిరి. వారికి ౫ మంది సంతానము. అందరును చిన్నవారు!

మావిజ్ఞానవర్ధనీ పరిషత్తుపై వారికభిమానము మెండుగా నుండెను. నేను బాగై వచ్చిన తర్వాత గ్రంథప్రచురణకై కొన్ని వేల మూలనిధిని మీపరిషత్తునకై కూర్చియిత్తును అని చెప్పి యుండిరి. అది మాభాగ్యమున లేనిదైపోయెను. వారి ఆసద్భావనయే వారి యీగ్రంథ ప్రచురణాభిలాషను పూర్తిచేయుటకు మమ్ము పురికొలిపెను. మా ప్రచురణములలో దీని నొకటిగా వారి జ్ఞాపకార్థముగా వెలువరించుచున్నాము.

విజ్ఞానవర్ధనీ పరిషత్తు
ఆగస్టు ౧౯౪౬
హైద్రాబాదు. దక్కన్

సురవరము ప్రతాపరెడ్డి,
అధ్యక్షుడు.

# మనవి

'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే'

విజ్ఞాన ప్రచారమునకు సాధనముగా ఈ విజ్ఞానవర్ధినీ పరిషత్తు క్రీ. శ. ౨౦-౧౧-౧౯౪౧ నాఁడు హైదరాబాదు నగరమున స్థాపింపఁబడినది. ఈ యైదేండ్లుగా పదునైదుదినముల కొకతూరి జరుగు సమావేశములలో పారిషదులు విజ్ఞాన ప్రదములగు వివిధవిషయములపై వ్యాసములను జదివిరి. ఇట్టిపక్షసమావేశములలో జరుపు వైజ్ఞానిక చర్చలతోఁబాటు ఉత్తమ గ్రంథ ప్రకటనముకూడ పరిషదుద్దేశమై యున్నది. విజ్ఞానవర్ధినీ గ్రంథావళిలో పరిషత్సభ్యులచే రచింపఁబడిన ౧. మృత్యుసిద్ధాంతము ౨. రామాయణ విశేషములు ౩. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము ౪. అలంకారవసంతము అను గ్రంథములు ఇంతకుముందు ప్రకటింపఁబడినవి. ఇప్పు డీ గంగాపుర మాహాత్మ్యమును పరిషద్ గ్రంథావళిలో అయిదవ గ్రంథముగా ఆంధ్రలోకమునకు సమర్పించుకొనుచున్నాము. రెండు మూఁడు నెలలలో 'పారశీకవాఙ్మయ చరిత్రము' అను గ్రంథమునుగూడ ప్రకటింపనున్నాము. దీనిని పరిషత్సభ్యులును సుప్రసిద్ధులు నగు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు, (బి.ఏ., ఎల్.ఎల్.బి.,) రచించిరి.

ప్రకృతము ప్రకటించిన గంగాపుర మాహాత్మ్యమును క్రీ.శ. ౧౮౦౦ ప్రాంతమున నుండిన రెడ్డి మల్లారెడ్డిదేశాయి కవివర్యుఁడు రచించెను. ఇది యొక స్థల పురాణము. ప్రబంధపద్ధతిలో వ్రాయఁబడినది. దీనికి పరిషదధ్యక్షులగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు సవిమర్శమైన యుత్తమపీఠికను వ్రాసిరి. అందు కవి కాల కవితా ప్రాశస్త్యాదులు విశదముగాఁ జర్చింపఁబడినవి. ఈ గ్రంథమును కీర్తిశేషులగు రెడ్డి దామోదరరెడ్డి (బారిస్టర్) గారి స్మృతిచిహ్నముగా వారి పితృవ్యులు శ్రీ రెడ్డి (గడ్డపల్లి) రామకృష్ణారెడ్డి దేశముఖుగారు ప్రకటించి నాలుగు నూరుల ముద్రిత ప్రతులతోఁ గూడ ఈ గ్రంథ సర్వస్వామ్యములను విజ్ఞానవర్ధినీ పరిషత్తునకు దయచేసిరి. భాషాభిమానులని ప్రసిద్ధిగాంచి తొలినుండియు మావిజ్ఞానవర్ధినీ పరిషత్తుపై ప్రత్యేకాదరమును జూపుచున్న శ్రీ రెడ్డి రామకృష్ణారెడ్డి దేశముఖుగారికి హృదయపూర్వకమగు కృతజ్ఞతను వెల్లడించుచున్నాము. పీఠికాకారులగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారికిని మేమెంతయు గృతజ్ఞులము.

శా. శకము ౧౮౬౮
వ్యయ భాద్రపద పూర్ణిమ.
హైదరాబాదు (దక్షిణ)

సహృదయ విధేయుఁడు,
చలమచర్ల రంగాచార్యులు,
విజ్ఞానవర్ధినీ పరిషత్ కార్యదర్శి
౧౧-౯-౪౬

శ్రీ కేశవస్వామినేనమః
శ్రీమతే రామానుజాయనమః

# గంగాపుర మాహాత్మ్యము



శా. శ్రీగోపీవదనారవింద మధుర శ్రీరంజితస్వాంతు నా
వాగీశప్రముఖామరార్చిత పదద్వంద్వున్ గృపాంభోనిధిన్
భోగిశైకశయానుఁడై వెలుఁగు నంభోజాతనేత్రున్ హరిన్
శ్రీ గంగాపుర కేశవప్రభువునే సేవింతు నశ్రాంతమున్. ౧

చ. వెలయఁ ద్రయీనినాదములు వీణయపై, శరదిందుచంద్రికా
విలసనముల్ దనూలతను వేడుకఁగాఁ దళుకొత్తనొప్పు ని
శ్చలశుక పుస్తకాక్షయుతచారుకరాంబుజ సత్కవీంద్రని
ర్మలముఖ సద్మవాణి యసమానవచోవిభవమ్ము లీయుతన్. ౨

సీ. తన తల్లి దాస్యంబు తలగించ నేవుమై
(సుధ) దెచ్చి కద్రువ సొమ్ముఁ జేసె
ఘన జగత్కుక్షియా కైటభారాతికిఁ
బక్కెర తేజియై పరగనొప్పె
కుక్షిస్థితక్షుధా భక్షణోద్యగుఁడై
గజకచ్ఛపుల వాదు కలనదీర్చె
సదయుఁడై సద్భక్తజనుల వైకుంఠ స
త్పదవి గల్గఁగఁ జేసి వాసిగాంచె

అట్టి గరుడాళువారుల ననఘచరితు
భవ్యు నానందమయుఁ బరబ్రహ్మవిదుని
వేగవంతు సుపర్ణుని వినతసుతుని
పాదపద్మయుగంబు నే భజనసేతు. ౩

మ. హరికిం బువ్వులపానుపై గొడుగునై యాస్థాన పీఠంబునై
మెరుగుం బుత్తికిచేలమై నిలయమై మించుల్ దువాళించు త
చ్చరణ భ్రాజితపాదుకంబులయి దాస్యం బింపుగా సల్పు నా
యురగాధీశుని నిత్యసూరుని మదిన్ నూహింతు సద్భక్తితోన్. ౮

సీ. ఘనతరాకారి సద్గర్భసంజనితుఁడై
చనుబాలు ద్రావఁడే సజ్జనుండు
తింత్రిణీకోటరస్థితి దివ్యదృష్టి నీ
మనుజుల జూడఁడే యనఘమూర్తి
మధురకవికిఁ జండమార్తాండ రుచులతో
దర్శనంబిచ్చె నే ధన్యయశుఁడు
ధృతి నూటయెనిమిది తిరుపతుల్ ద్రావిడ
పాటగావించె నే ప్రాజ్ఞుఁడెలమి
పరమపురుషుండు పతితాళిపావనుండు
వకుళభూషణ సన్మౌనివర్యుఁ డట్టి
నమ్మయాళ్వారి సంతతానందనిధిని
సరస మధురప్రసంగతి సన్నుతింతు. ౯

సీ. శ్రీమదష్టాక్షరీనామమంత్రసురత్న
పఠనవిహారు శ్రీ భాష్యకారు
కమనీయ శుభలిప్త కల్పభూజము గతి
వరకృపోదారు శ్రీ భాష్యకారు
చార్వాక పాషండజైన మాయావాద
బౌద్ధ ఖండనకారు భాష్యకారు
లక్ష్మీశ శయన విలక్షణ ఫణిరాజ
ప్రకటావతారు శ్రీ భాష్యకారు

భవ్యవార్ధిగంభీరు శ్రీ భాష్యకారు
పటుతర త్రిదండధారు శ్రీ భాష్యకారు
పతితజనసముద్ధారు శ్రీ భాష్యకారు
సంతతంబును మది ప్రస్తుతింతు భక్తి. ౬

సీ. శ్రీహరి పాదరాజీవంబులకు మ్రొక్కి
పెరియ ఫిరాట్యారు పేర్మిఁ బొగడి
సరసలతమీద విష్వక్సేను బ్రార్థించి
శఠకోప ముఖ్యుల సంస్మరించి
నాథమానికి వందనము భక్తిగావించి
పుండరీకాక్షుల బూజసేసి
రామమిశ్రులకుఁ గరంబులు ముకుళించి
యామునాచార్యుల ప్రేమసలిపి
అల పరాంకుశ దాస రామానుజులకుఁ
బొనర ప్రణమిల్లి సద్గురువులకు మ్రొక్కి
బహులతరకీర్తి సద్గురు భవ్యమూర్తి
తిరుమలాంబళధన్య వ్యాత్రిరి నిలిపి. ౭

సీ. పటుతరశ్లోక నిబంధన ప్రకటిత
(ప్రతిభుని) వాల్మీకిఁ బ్రస్తుతించి
భారతకృతికళాభారతీ సద్వంశ
వర్ధను శ్రీవ్యాసవరు భజించి
కావ్యత్రియీకర్త కాళిదాసును గొల్చి
మాఘభారవులను మది దలంచి
బాణ మయూరుల భవభూతి దండిని
జయదేవపాదుల సంస్మరించి

కృష్ణకర్ణామృతస్మృతి కీర్తి సుకవి
హర్షనైషధకర్త శ్రీహర్ష మహితు
చోరసౌమిల్లులను మహాసుభగమతుల
నాది సుకవులఁ బ్రణుతింతు మోదములర.

సీ. తెనుఁగు సత్కృతులను దెరువునఁ బెట్టిన
యట్టి నన్నయభట్టు నభినుతింతు
పాలగొందు తిక్కనసోమయాజికి మ్రొక్కి
శంభుదాసుఁ దలంచి జృంభణోక్తి
నాచనసోముని ధీచర్య గొనియాడి
శ్రీనాథసుకవివరేణ్యుఁ గొలిచి
రామాయణాఖ్యానరంజితు భాస్కరు
పింగళి సూరయ్య రంగనాథు
భీమనాథ దయాధాము భీమనార్యు
పుణ్యగుణధుర్యు బమ్మెర పోతనార్యు
సరసమహితాంధ్ర వివిధభాషా కవిత్వ
పట్టభద్రుల వరభక్తిఁ బ్రస్తుతింతు.

సీ. నగము చందురుసొంపు నగజాలు నుదుటిపైఁ
గస్తూరి తిలకంబు గ్రిందుకొనఁగ
ముకురాల మించిన ముద్దుచెక్కులమీఁద
మద్దికాయల రుచుల్ మలసియాడ
జలదమండలముపైఁ దళుకొత్తు రవిమాడ్కి
నెడమాళికపు పేరు నొడలమెరయ
సంపంగి మొగ్గతో చదురాడుముక్కున
గొప్ప ముత్తెపుసోగు గొనబుసూప

కనక కేయూర కంకణాంగదములమర
ముద్దుమాటల గోపికాముగ్ధలలర
తల్లిముందర నాడుచు నుల్లసిల్లు
బాలగోపాలకృష్ణునిఁ బ్రస్తుతింతు. ౧౦

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, పూర్వాచార్య సంస్తవంబును, వాక్య గురుపరంపరయు, నస్మదాచార్య వర్ణనంబును, సుకవి పురస్కారంబును చేసి, యేనొక్క మహాప్రబంధంబు శబ్దబంధురంబుగా రచియింపంబూని యేతత్కృతి ముఖాలంకారంబుగా మదీయ వంశావతార మభివర్ణించెద. ౧౧

సీ. వనధిసుతాధీశ వదనేందు బాహూరు
పదములఁ బుట్టిరి భాగ్యనిధులు
బ్రాహ్మణ క్షత్రియ పటువణిక్ శూద్రులు
శ్రుతి జయవాణిజ్య సుభగమతులు
వీరిలో శూద్రులు విభవసమగ్రులై
సకల జీవావన సమతఁ బ్రబలి
రందులో ఘనులు పుణ్యాత్ములు మోటాద
సద్వంశగణ్యులు సరసహృదయు
లలర వారలయందు మహామహుండు
సతత షోడశదాన విస్తారయశుఁడు
గురుతరంబైన రెడ్డికులపవిత్రుఁ
డగుచు శ్రీ తిమ్మారెడ్డి దా నవని వెలసె. ౧౨

ఉ. శ్రీకరసత్యసంధుఁడు ప్రసిద్ధుఁడు ధన్యుఁడు తిమ్మారెడ్డి స
త్కోకనదచ్ఛదాక్షి సుమకోమలి సింగమ బెండ్లియాడి యు

స్తోకచరిత్రులం గనియె శోభితు తిమ్మధరాధినాథు సు
శ్లోకుని మండలిప్రభుని శుభ్రయశోమహనీయు ధర్మ్యులన్. ౧౩

చ. జలరుహ మిత్ర తేజుఁడు విశాలయశో మహనీయమూర్తి యు
జ్జ్వలతర రెడ్డిరెడ్డికులసాగర చంద్రుఁడు తిమ్మభూవిభుం
డలరుచు పెండ్లియాడె విపులానన నిర్జిత చంద్రబింబ ని
ర్మల సుగుణావలంబ యసమాన నితంబను పోచమాంబికన్. ౧౪

కం. ఆ మండల భూనాథుఁడు
భామామణి ముద్దమాంబ భాగ్యకదంబన్
ప్రేమ వివాహంబై తా
ధీమంతుఁడు సుతులఁ గనియె తేజోనిధులన్. ౧౫

వ. వారెవ్వరం డేను. ౧౬

సీ. పోలిల్వాలగోత్ర సంపూర్ణాబ్ధిచంద్రుండు
మల్లభూనాథుండు మాన్యయశుఁడు
శ్రీనాథ పదపద్మ సేవాధురీణుండు
సత్యభాషా హరిశ్చంద్రుఁ డతుల
మహనీయకీర్తిచే మాంధాతృకై వడి
శిబి ఖేచరాదుల చెలువు మిగులు
అలరారు కార్తవీర్యార్జును కైవడి
శోభిల్లు దిక్కుల సొగసు లెసఁగ
కుతుబుశాహ నరేంద్రుచే కోర్కెలలర
అందలంబును తత్శ్రీవు లందుకొనుచు
సరస బూర్గులపట్టణ చౌధరగుచు
ప్రజలఁ బాలించె భూభుజుల్ ప్రస్తుతింప. ౧౭

కం. శ్రీరంజిత లింగాంబను
సారసదళ నేత్ర విమల చంద్రానన వి
స్ఫార పతివ్రత గణ్యను
నారీమణిఁ బెండ్లియాడె నవ్యశ్రీలన్. ౧౮

కం. ఆతని తమ్ముఁడు నూతన
చేతోజాతుండు రాజశేఖరుఁడెలమిన్
మాతాత పర్వతేంద్రుఁడు
భూతలమున వెలసె బంధుపోషణ ప్రీతిన్. ౧౯

సీ. కమఠ వరాహ దిగ్గజముల రీతిని
(భువనమ్మునమోసె) నే పుణ్యశాలి
ధాళధళ్యప్రభా ధవళ సత్కీర్తిచేఁ
బూరించె విశ్వమే భూభుజుండు
దాన ధారా (నదీ) తరుణుల జలధికిఁ
బెండ్లిండ్లు జేసె నే పృథులయశుఁడు
పరిపంథి నృపతులందరి నప్పురశ్శ్రీల
కాఁగిళ్ళదార్చె నే ఘనభుజుండు

అతఁడు రంజిల్లె నెంతయు వితతకీర్తి
సంతతౌదార్య చాతుర్య సాహసముల
మహిత మండలి రెడ్డికుమారుఁడౌర!
ప్రబలె పర్వతరెడ్డి భూప్రజలు పొగడ. ౨౦

గీ. మానినీమణి సౌభాగ్యమాననీయ
యించు విలుకాని తేజి రాయంచ గమన

పుణ్య సద్గుణ నికురుంబ పోచమాంబ
నర్థిఁ బెండ్లాడె పర్వతాధ్యక్షుఁడెలమి. ౧౧

కం. ఆ కాంతామణియందును
బ్రాకట నిత్యాన్నదానబంధుర యశులన్
ధీకలితుల ముగ్వుర ల
క్ష్మీకరులన్ గనియె మిగుల చిత్తంబలరన్. ౧౨

కం. ఆ పర్వత భూపాలుని
తోఁబుట్టువు తిమ్మవిభుఁడు దోర్బలశత్రు
క్ష్మాపాల కుంభి సింహుఁడు
దాఁ బరిణయమయ్యె వేడ్కఁ దగు తిమ్మాంబన్. ౧౩

వ. మరియు నప్పర్వతరెడ్డి పుత్రత్రియంబునం దగ్రజుండు. ౧౪

ఉ. సంగరరంగ నిర్దళిత శాత్రవ సైన్యుఁడు బంధుకోటికిన్
తంగెటిజున్ను, సత్కవివితానము పాలిటి కల్పశాఖి, శ్రీ
రంగపదాబ్జయుగ్మ భ్రమరంబు విభాసిత వైభవోల్లస
త్తుంగ పురందరుండనగ నొప్పెను రంగవిభుండు భూస్థలిన్. ౧౫

చ. వరుసతొ నవ్యకీర్తిలత పాటవు బంగరుకొండ బ్రాకువన్
నరుగున బ్రాకి నింగి యను చత్వరమంతయు నిండి తారకా
స్ఫురణమె పుష్పపుంజముగఁ, బుష్పాడి చంద్రికగాఁగఁ జంమ్రిఁడ
న్వరఫలరాజమున్ గలిగి వర్ధిలె రంగసుధీజనాగ్రిఁడున్. ౧౬

సీ. కమలజాండంబెల్ల కనకంపుభరణి, యే
ఘను యశశ్శికర్పూర కాండమునకు

పంజరంబయ్యె నీ పాథోధి పర్యంత
భువనత్రయంబు నే భూభుజునకు
జలధులేడును రత్నగలశులే ధన్యాత్ము
నిత్యదానోచిత నీరమునకు
పరిపంథి నృపశిరఃపటలిపూమాల యే
ధీరు దోఃఖడ్గోగ్రభైరవునకు
రమ్యగుణభాసి నీతివారాశి, వాసి
మహిత సంపూర్ణపూర్ణిమా తుహినకరుఁడు
వితత పోలిల్వాలగోత్ర పవిత్రుఁడౌర
భవ్యగుణశాలి రంగభూపాలమౌళి. ౨౬

గీ. చారుముఖకాంతి నిర్జిత చంద్రబింబ
లలితభాగ్యకదంబ శ్రీ లక్కమాంబ
నబ్ధికన్య వరించు పద్మాక్షుభాతి
రంగవిభుఁడు వరించెను రమ్యముగను. ౨౭

గీ. రంగధాత్రీశు తనయుఁడే రాజవర్యుఁ
డింపుమీరంగ భువి కుండలేంద్ర ఘనుఁడు
బంధు సురశాఖి కామినీ పంచశరుఁడు
వర్ణనీయుండు జంగభూవల్లభుండు. ౨౮

గీ. వెలయు సౌందర్యమున రతి, విమలకీర్తి
(క్రమగుణపేటి నవచంద్రికావధూటి)
పుణ్యమార్గంబుచే నన్న పూర్ణ దెగడి
దిక్కులను హెచ్చె రంగయ లక్కమాంబ. ౨౯

కం. ఆ దంపతులకు హృదయా
(హ్లాదము గలుగంగ ముగుర మాత్మజులము మా

సోదరియును బొడమితి మా)
శ్రీదయితుని కరుణవలన సేనుంబలరన్. ౩౦

కం. వారికి జ్యేష్ఠుఁడ విద్యా
పారీణుఁడ బాంధవార్థి ఫలదాయకుఁడన్
ధీరుఁడ బుధజన వినతుఁడ
కూరిమి మల్లాఖ్య ఖ్యాతి గాంచినవాఁడన్. ౩౧

కం. కోన మధ్యుఁడను, రంగ
త్సోమనాధుని కూర్మిసుతుఁడ, కమలాక్షపద
ధ్యానగరిష్ఠుఁడ, మహీ వి
జ్ఞానానందైక రతుఁడ సజ్జన హితుఁడన్. ౩౨

వ. మదీయు లెట్టివారంటేని. ౩౩

కం. మదవరజుండగు నల్లప
సదమల కీర్తిప్రభావ సముచిత శౌర్యా
భ్యుదయ ధనంజయుఁడరిపుల
(విదళనపారీణుఁడనఁగ విఖ్యాతిగనెన్.) ౩౪

సీ. ఏరెడ్డి వాగ్జాల మిందిరాధిప తల్ప
ఫణి సహస్రఫణోక్తి బరిఢవిల్లు
యేరెడ్డి హృదయాబ్జ (మినకులాధిప దివ్య
గాథానురక్తి వికాస మొందు)
యేరెడ్డి దోర్దాన మిద్ధార్థి ప్రత్యర్థి
సంఘంబులకు దివ్యసౌఖ్య మొసఁగు
యేరెడ్డి సౌందర్య మింద్రనందనలస
న్మీనకేతాదుల మేలమాడు

(ఖ్యాతి) గాంచెను రాజకుభాంతరముల
నతఁడు గంగాపురాధ్యక్షు డంబుజాక్షు
చరణ సేవాధురీణ విస్ఫురితహృదయుఁ
డెల్ల ధన్యుండు సామాన్యుఁడే ధరిత్రి. 3౫

కం. ఆతఁడు పరిణయమయ్యెను
శాతోదరి పద్మనేత్ర చంద్రనిభాస్యన్
ఖ్యాతిని బొమ్మాంబను ఘన
(పాతివ్రత్యావలంబ భాగ్యకదంబన్.) 3౬

కం. అతని సహోదరుఁడంచిత
మతిమంతుఁడు మోహనాంగసుదనుఁడు ధర్మా
న్వితుఁడు ప్రసిద్ధుఁడు వరద
క్షితిపతి రాణించె బంధుచింతామణియై. 3౭

సీ. తనయాజ్ఞ శిరములఁదాల్చి భూభుజకోటు
లప్పనంబులు వెట్టి యనుచరింప
తనదోః కృపాణోగ్రదళితారి పార్థివుల్
సురవధూసురత విస్ఫురణఁ జెలఁగ
తనచేతి దానంబు తగఁగొన్న యాచకుల్
కర్ణాది వితరణఘనులఁ దెగడ
తనమూర్తి వీక్షించి తరలాయతేక్షణల్
పుష్పాస్త్రుఁ డితఁడని (పొలుపుఁజూవ)
అతఁడు విలసిల్లె నెంతయు నతుల శౌర్య
సత్య దానదయాధర్మ సౌష్ఠవముల
పుణ్యారెడ్డి సత్కుల భూషణుండు
భవ్యగుణశాలి వరదభూపాలమౌళి.

గీ. సరసుఁడాతఁడు బెండ్లాడె సంబరమున
కుందరదనయు హరిమధ్య చందమాంబ,
(లలిత గుణశీల సుందరి) లక్షుమాంబ,
పడతు లిద్దరి విమల సౌభాగ్యవతుల. ౩౯

గీ. వహిని సంగమగంగ భూవరుని రాణి
యలరెనాళ్రగసంభవ యగుచు ధాత్రి
రమ్య పుణ్యావలంబ శ్రీ రామమాంబ
పరగ చందురుతోబుట్టు సిరి యనంగ. ౪౦

శా. శ్రీగంగాపుర చన్నకేశవ దయాశ్రీలబ్ధ రంగాహ్వయా
పాగర్భాబ్ధి సుధామయూఖుఁడను శుంభచ్ఛబ్దమాధుర్య స
త్ప్రాగల్భ్యోచిత కావ్యనిర్వహణ భాస్వత్కీర్తి మల్లాఖ్యుఁడ
న్నాగోవింద కథాసుధానుభవలోలాయుత్తహాత్ముఁడన్. ౪౧

కం. ధీరులు (మత్పుత్రులు రం)
గారెడ్డియు మోహవిభుఁడు ఘనుఁడగు శ్రీల
క్కారెడ్డి బక్క ధన్యుఁడు
సారస్యుఁడు నల్వు రమిత శాంతగుణాఢ్యుల్. ౪౨

కం. తనయులు, తమ్ములు దగ నా
యనుమతి మెలగంగ సంతతానందము నె
మ్మనమున నించితి హరి క్రొ
న్ననవిల్తునితండ్రి యొక్కనాఁడనురక్తిన్. ౪౩

సీ. నీలాంబుదశ్యామ నిబిడాంగ రుచులొప్ప
మొగమున చిరునవ్వు మొలకలెత్త

కౌస్తుభ శ్రీవత్సకలిత వక్షస్థలి
సిరులను చూపులగరిమ మెరయ
మకరకుండల రత్నమకుట కేయూరాది
భూషణస్ఫూర్తులు పొలుపు మిగుల
శంఖచక్రగదాసి శార్ఙ్గాది సాధన
కలిత చతుర్బాహుకలన దనర

కాంచనాంబర దీధితుల్ కలయఁబర్వ
విమల కరుణామృతౌదార వీక్షణములు
ప్రబల, సనకాదిసన్మునుల్ ప్రస్తుతింప
వెలయు కేశవమూర్తినాకలను నిలిచె. ౮౮

వ. ఇట్లు నాస్వప్నంబున ప్రత్యక్షంబై నిలిచిన యద్దివ్యతేజోవిరాజమానుండగు నప్పరము పరంధాము శ్రీరమాకళత్రు పద్మనేత్రు, నయ్యాదికేశవు చిదానందమూర్తి విలోకించి హర్షపులకితగాత్రంబుతోఁ బరమానందకందళితహృదయారవిందుండనగుచు సాష్టాంగంబు సేవించి హస్తాంబుజంబులు ముకుళించి యున్న నన్నుడాయంబిలిచి కమలా రమణి రమణీయ పీన వక్షస్తనా భోగ మకరికా పత్ర విలిఖిత ప్రప్రశస్తంబగు హస్తంబున నభయంబొసంగియు క్రమ్మన మేను నిమురుచు, వత్సా! నీవిప్పుడు రచియింపం బూనిన గంగాపురి మాహాత్మ్యంబు మదంకితంబుగా రచియింపుము. ఏను గంగాపురాధ్యక్షుఁడ నగు కేశవమూర్తినని యును నీకును పుత్ర పౌత్రాందోళికా ఛత్ర చామరాది సకల సంపద్వైభవమును ప్రసాదింతునని యానతిచ్చిన సంతోషితస్వాంతుఁడనగుచు నట్లు కావింతునని ప్రస్తుతించిన నాకర్ణించుచు నద్దివ్యమంగళ విగ్రహుండు తిరోహితుండయ్యె నంత ప్రభాతం బగు

టయు మేల్కాంచి నిత్యోచితకృత్యంబులు నిర్వర్తించి రెడ్డి కుల పయఃపారావార సుధాకరుండును, ప్రోల్వాలగోత్ర చరిత్రుండును, తిరుమలవంశధుర్యుండగు నాథశాచార్య శిష్యశ్రేష్ఠుండును దిగిభశుండాదండసన్నిభ నిజభుజాదండ కోదండ నిర్ముక్త శర పరంపర నిహన్యమాన శాత్రవరాజన్య మండలుండును, వల్లెపల్లి పురమందిర నివాసుండును, విద్వత్కవిశ్రేష్ఠ సంస్తూయమాన దానపారీణుండును, లక్కమాంబా ముఖాంభోజ మిత్రుండును, మిత్రప్రతీకాశ తేజోవిరాజమానుండును, బూర్గులపట్టణ దేశాయి చంద్రుండును, యశఃసాంద్రుండును, మజ్జనకుండును అగు రంగ భూపాలుండును, సభాస్థాన మంటపాభ్యంతర కురంగ భృన్మణి వితర్దికోపరి ముక్తాఫల కీలిత రత్నకంబళముపై సుఖాసీనుండగు నయ్యవసరంబున. ౨౭.

సీ. సర్వశాస్త్రార్థ విశారదు లొకవంక
నుభయభాషాకవు లొక్కచక్క
పౌరోహితామాత్య బాంధవు లొకకేవ
నొకచోట భాగవతోత్తములును
గాణలు జాణలు కామిను లొకతేవ
నురుతర రావుతు లొక్కదారి
మన్నీలుదొరలు సామంతులు నొకచెంత
నొప్పైన భటనటు లొక్కమోల

అమరి రమణులు వింజామరములు వీవ
నంచితంబుగ భద్ర సింహాసనమున
నిండుకొలువుండె కన్నులు పండువగుచు
రంగుమీరంగ రెడ్డి రంగ శౌరి. ౨౮

వ. ఇట్లు కొలువై యున్న మజ్జనకుని సన్నిధానంబున నిలిచి, తదీయ పాదపద్మంబులకు సాష్టాంగదండంబు లాచరించి, లేచి కరకమలం బులు ముకుళించి వినయపూర్వకంబుగా మదీయ స్వప్నప్రకా రంబు సమస్తంబును విన్నవించిన నతండు హర్షోత్కర్ష పులకిత గాత్రుండగుచు దిగ్గునలేచి ప్రేమాతిశయంబున నన్నుం గౌగిటం జేర్చి శిరంబు మూర్కొని చుబుకంబు పుణుకుచు వత్సా! కృతా ర్థుండవై తివి. మదీయ వంశంబును జన్మంబును ధన్యంబులయ్యె. శ్రీరమాజాని యానతిచ్చినక్రమంబున నీతత్క్షేత్రతీర్థమాహాత్మ్యంబు సవిస్తరంబుగా శబ్ద బంధురనిబంధనంబుగా రచియింపుమని యాన తిచ్చినఁ దదీయాదేశంబు శిరంబునందాల్చి, అయ్యాదికేశవమూర్తిని మనఃపద్మకర్ణికా రత్నసింహాసనాధిష్ఠితంబు గావించుకొని వందన పూర్వకంబుగా నిట్లని రచియింపందొడంగి తది యెట్లనిన. ౮౭

సీ. జయజయ శ్రీ రమాజాని లోకారాధ్య
జయ భక్తకామిత సారశాఖి
జయజయ మార్తాండ శతకోటిసంకాశ
జయ నారదాది సంస్తవచరిత్ర
జయజయ నీరదశ్యామ దివ్యశరీర
జయ సంతతానంద చారుహృదయ
జయజయ ఘన శంఖచక్ర సాధనహస్త
జయ పన్నగాధీశ శయన శౌరి

గరుడవాహన కౌస్తుభకలితవక్ష
శ్రీధరాచ్యుత గోవింద కృష్ణ నన్ను
కరుణమీరఁగ రక్షించు పరమపురుష
భానుశశినేత్ర గంగాపురీ నివాస. ౮౮

షష్ట్యంతాలు :

కం. అక్షరునకు దైత్యకులా
ధ్యక్షమదేభేంద్రహనన హర్యక్షునకున్
పక్షిధ్వజునకు సురసం
రక్షునకు (ను) కేశవునకు రణదక్షునకున్.

కం. కుక్షిస్థితలోకునకును
దక్షాధ్వరదమనవినుత దాక్షిణ్యునకున్
అక్షీణసదయు పాండవ
పక్షునకును భక్తనివహ పరిరక్షునకున్.

కం. ఇందిర హృదయాంభోరుహ
సుందరమత్తద్విరేఫ సుగాత్రునకున్
వంద యశోదా ప్రియవర
నందనునకు ఫుల్లవిమల నలినాక్షునకున్.

కం. జిష్ణు ప్రియమిత్రునకును
కృష్ణావనపరమఘృణికి కీర్తిప్రియరో
చిష్ణునకును గృష్ణునకు స
హిష్ణునకును దివిజకుల సమీడితకృతికిన్.

కం. రక్షోహంతకు కాళియ
శిక్షిత నృత్యప్రశస్తశీలునకు రమా
ధ్యక్షునకును కరుణామృత
వీక్షిత జగదవనవిమల విభవాఢ్యునకున్.

కం. గంగాపుర కేశవునకు
గాంగేయ నిభాంబరునకు కమలారమణీ

తుంగ స్తన కుంకుమయుత
మంగళమూర్తికిని నిత్యమహనీయునకున్. ౫౪

వ. వందన సహస్రపూర్వకంబుగా నా యొనర్పంబూనిన గంగాపురీ క్షేత్రప్రభావ నిబంధన మహా ప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౫౫

# కథా ప్రారంభము

కం. నైమిశవనమున మునిసు
త్రాములు, లక్ష్మీశ పాద రాజిత భక్త్యు
ద్దాములు, శౌనకముఖ్యులు
ప్రేమం దగసూతుఁ జూచి పృథుమధురోక్తిన్. ౫౬

గీ. స్కాందమున నెంచ నేఁబది ఖండములును
నందులో తీర్థఖండంబె యతిశయిల్లు
కరము శోభిల్లు తత్ క్షేత్రఖండ మింక
శ్రీరమానాథుఁ డచ్చోటఁ జెలఁగుచుంట. ౫౭

వ. అట్టి క్షేత్రతీర్థ ప్రభావంబును, సకల దేవతాసార్వభౌముండును, భక్తజన సంరక్షణోద్దాముండును, కమలవాసినీ కళత్రుండును, కంజదళచారు నేత్రుండును, శ్రీ రుక్మిణీధవుండును, వేదాంత వేద్యుండును, భక్తముక్తిప్రదుండు నగు శ్రీ చెన్న కేశవునకు హృదయంగమ నిలయంబగు తత్ క్షేత్రతీర్థ మాహాత్మ్యం బానతియ్యవలయు నస్మత్సందేహంబు నివర్తింపంజేయు నీవే యర్హుండవని విన్నవించిన శౌనకాది మహామునులకు సకల పురాణేతిహాస కథాకథన శేముషీ సమేతుండగు సూతుం డిట్లనియె. ౫౮

కం. నాలుగు యుగముల వరుసను
నాలుగు నామముల వెలసె నలినాక్షునకున్
శ్రీలలనా భాసతులకు
కేళీసాధముల దనరు కీర్త స్ఫురణన్. ౫౯

సీ. కృతయుగాదిని సర్వకీర్తినీయంబయ్యె
మత్స్యాపురంబన మహితమగుచు
త్రేతాయుగంబున దేదీప్యమానమై
దురితకోలాహల స్ఫురణదనరె
ద్వాపరయుగమున వర్ధిల్లి నుతికెక్కె
మాయాపురంబన శ్రేయమగుచు
కలియుగంబునమించె గంగాపురంబునా
భుక్తిముక్తిప్రదాసక్తమగుచు
అట్టి గంగాపురాధ్యక్షు నంబుజాక్షు
శ్రీరమానాథు కేశవుఁ చిన్మయాత్ము
నిలయ సుక్షేత్ర మహిమంబు తెలిసి వలుకఁ
దరమె శంభునికైన విధాతకైన. ౬౦

మ. ఘన నీలాంబుద చారుదేహు విలసత్కారుణ్యసందోహు కాం
చనగర్భేందు కిరీటు మాధవనిభున్ సారంగచర్మాంబరున్
మునిముఖ్యాధ్యు బరాశరాత్మజు పదాంభోజాతయుగ్మంబు స
య్యాన సద్భక్తి భజించు నిచ్చలు సముద్యజ్జ్ఞానసంసిద్ధికిన్. ౬౧

కం. వ్యాస ప్రసాద మహిమన్
జేసియు తత్ క్షేత్ర మహిమ చిత్తములలరన్
జేసెద మీ కేనెంతయు
భాసురనిష్ఠాగరిష్ఠ భావనులారా. ౬౨

క౦. మీరడిగినట్లు ధర్మజుఁ
డారూఢిన్నడిగెఁ బద్మజాత్మజు నెలమిన్
సారసదళాక్షు ననుమతి
నారదమునివర్యుఁడనియె నరనాథుఁతోఁ. ౬౩

క౦. గంగావాహిని పేరిట
గంగాపురమనఁగ వెలసె గహ్వరిమీఁదన్
రంగత్కేశవగేహము
సంగతితో భుక్తిముక్తి సంపత్ప్రదమై. ౬౪

వ. తత్క్షేత్ర తీర్థ ప్రభావం బభివర్ణింప శేషభాషానాథ శంకరులకైన నలవిగాదైనను నానేర్చుచందంబున తత్పుటభేదన సుషమాది విశేష రామణీయకంబు లెఱింగించెద సావధానుండవై యాకర్ణింపుమని యద్దివ్యతపోధనధుర్యుం డా భూపాలవర్యున కిట్లనియె. ౬౫

ఉ. కోటలగడ్త లట్టడులు గోపురకుడ్య కవాట దేహళుల్
నీటగు రత్నహర్మ్యములు నీలవితర్దులు పచ్చరచ్చలున్
హాటకరమ్యసద్మములు హంససుధాకరవీధులొప్పగాఁ
బాటిలు తత్పురం బమరెఁ బాకవిరోధిపురంబు గేరుచున్. ౬౬

సీ. కోటగట్టెడుచోట నీటుగాదనిమీట
వితరణమణిచేసె విబుధపురము
గోవులలోనెల్ల కొంచెమీవంచని
వెళ్ళగొట్టినగిడ్డి వేల్పుటావు
వనములు నిల్చుచోఁ బనికిరావని పాఱ
వైచినవి సురద్రుపంచకంబు
సరసులకెనరాక విరసత నావ్యోమ
సరసియు శంకరు జడలు సొచ్చె

కోటవిభవంబు, గోవులపాటవంబు
తనర వనములు లలిత పద్మాకరమును
కరము శోభిల్లు నప్పురి గరిమెఁ బొగడ
తరమె శివునకునైన విధాతకైన. ౧౭

చ. తమతమ ధర్మహర్మ్యముల తామరసాక్షులు హారవల్లరుల్
క్రమమున గూర్చువేళ నధికప్రభలొప్పవి వేలయుంచు సం
భ్రమమునఁ బాఱజల్లిన విరాజిత మౌక్తికజాలమంద్రు ను
త్తమమగు తారకావళులు తత్పురసంపదలెన్నఁ జిత్రముల్. ౧౮

ఉ. అట్టడులందు కాంపురము లర్థినొనర్చు భటాలి కామినుల్
నెట్టణ దేవతానదిలో నీరజకైరవ మల్లికావళుల్
గట్టిగ గోసి తెచ్చి త్రిజగన్నుతు కేశవుఁ బూజసేయు న
ప్పట్టున భక్తిమీరఁగను భక్తజనంబులకిత్తు రింపునన్. ౧౯

చ. స్మరరణకేళిఁ దేలు హరిచందనగంధుల మందహాస సుం
దరతర చంద్రికాతతులఁ దన్మణిభిత్తుల చంద్రకాంత సు
స్థిర వరసాలభంజికలు శీకరరాజిత సాత్వికోదయ
స్ఫురిత చకోరలోచనల సొంపువహించును చూడ నప్పురిన్. ౨౦

చ. వరమణి హేమహర్మ్యముల వారలతాంగుల నృత్యగీతి సు
స్థిరతఁ జెలంగఁ జూచి సవిశేషవిలాసత దేవతాంగనల్
తరి నటుకేఁగుఁదెంచి ప్రమదంబున నెంతురు నృత్యగీత వి
స్ఫురణలు తత్పురప్రకట శోభితసంపదలెన్న చిత్రముల్. ౨౧

కం. నందనవనమునకంటెను
చందంబై పుష్పపుంజ సాంద్ర సుఫలితా

నందంబై విలసిల్లెను
క్రందుగఁ దత్పురము చుట్టు ఘనమగు వనముల్. 22

చ. జలధరరాజి వర్ణముల ఛాయయు చంపక కేతనద్యుదుల్
తొలకరి క్రొమ్మెఱుంగులును తోరపు కింశుక పుష్పపుంజముల్
వలనుగ నింద్రగోపములు వాసవచాపము సత్ఫలప్రభా
వలి పికశారికా శుకరవంబులు గర్జలుగాగ వాన లు
జ్జ్వల మకరందధారలుగ వర్షిలు దద్వనసంపదల్ పురిన్. 23

మ. చెరుకుందోఁటలు నాకుదోఁటలును సుక్షేమంబుగా బండునా
వరిచేలున్ చణకంబులున్ పెసలు సర్వాబీజసందోహ వి
స్ఫురణన్ వెండియు పైఁడియుం దడఁబడన్ శోభిల్లు తత్పట్టణం
బరయం గేశవ సత్కృపామహిమ నిత్యానందసంధాయియై. 24

సీ. వేదశాస్త్రాగమ విద్యాసమగ్రత
బ్రహ్మనిష్ఠాత్ములౌ బ్రాహ్మణులును
సిరికిబంటని బాహు సరకుసేయక శౌర్య
కదనరంగోత్సుకుల్ క్షత్రియులును
కోట్లకుం బడిగెలు కొంచ కెత్తుచు కీర్తి
వర్షిల్ల విలసిల్లు వైశ్యకులులు
ప్రాణికోట్లను కృపావరత రక్షించిన
బహుళధాన్యాఢ్యులు పాదభవులు

సకల సౌభాగ్య భోగవిస్తార పుణ్య
వంతు లెంతయు తత్పురవాసులరయ
పుత్రపౌత్ర సమగ్రులై పొడలుచుంద్రు
వరదు శ్రీనాథు కేశవు కరుణవలన. 25

చ. పరమపతివ్రతామహిమ భాగ్యపురంధ్రులు కేశవాంఘ్రి భూ
సుర గురుపూజనాపరులు శోభితకోమల దేహవల్లరుల్
సరసిజపత్రలోచనలు చందనగంధులు మందహాస సుం
దరవదనేందుభూషితలు తత్పురి పుణ్యపురంధ్రు లెంతయున్. ౭౬

చ. జవమున వజ్రివాహనము సయ్యన లాస్యపటుత్వవైఖరిన్
రవి రథసైంధవంబులను రమ్మనిపిల్చినభాతి మస్తక
ప్రపణను ఫేనసంపదల బల్మెఱుఁ గేరుచు నొప్పుచుండు ను
త్సవమునఁ దత్పురంబునను సారముమీఱిన యుత్తమాశ్వముల్.

కం. మదధారా నిర్ఝరులును
కదసిన ఘీంకృతులు విహగ కలకలరవముల్
పొదలఁగ జంగమ గిరులన
మదకరు లప్పురమునందు మలయుచు మెఱయున్. ౭౮

ఉ. పటుతర నేమిమీఁద మదబంధుర శాత్రవగర్వభంజన
స్ఫుట నవకేతనాశ్వయుత నూతసముజ్జ్వల ఘంటికాఘణ
చ్ఛటుల రవంబుల న్మిగుల సాంద్ర ఘనప్రభలొప్పఁగా సము
త్కట రథసంఘముల్ మెఱయు దత్పుటభేదన మధ్యసీమలన్. ౭౯

ఆ. వె. పులులనైనఁ దుమ్రిపవ బలిమి సింహంబులఁ
బట్టి కట్టు శరభపటలిఁ గూల్పఁ
బటి(మ) గల్గు వీరభటు లప్పురంబున
నలరుచుండ్రు శత్రుహరణులగుచు. ౮౦

ఉ. క్రిక్కిఱి గుబ్బచన్నులును క్రిస్సినకౌనులు ముద్దుచెక్కులున్
చుక్కల(తేని) యందమును సొంపగుమోములు చంచలాక్షులున్
చొ(క్క)పు క్రొమ్మెఱుంగులును చూపులుబట్టెడికోమలాంగముల్
చక్కని వారకామినులు సారెచెలంగుదు రప్పురంబునన్. ౮౧

ఉ. కుసుమశరాగమార్థరసగుంభను లంబుచరాంక శాస్త్ర స
త్ప్రసరణ శేముషీకలిత ధన్యులు మన్మథ సంగరోద్ధతుల్
రసికశిఖావతంసు లతిరంజిత సుందరసాంద్రహాసు లిం
పెసఁగఁగవారపద్మముఖు లెంతయు మింతురు తత్పురంబునన్.

మ. కరి కుంభ స్తనులందు బింబవదనల్ కంజాత పత్రేక్షణల్
హరిమధ్యల్ జలదాభ వేణులు లసద్ధేమాభసద్వర్ణలున్
స్మరసమ్మోహన మంత్ర దేవతలు భాస్వత్కౌముదీవీచికా
స్ఫురితోదంచిత విభ్రమాన్వితలునై శోభింత్రు వారాంగనల్. ౮౩

సీ. యరపిందములు దేవె యలివేణియన నవి
శంబరారికి మోహనాంబకములు
విరజాజిబంతులు వెలఁది దెమ్మన నవి
రతిహస్తకందుక రంజితములు
బంధుజీవములివె బంధుజీవన నవి
కుసుమాశుగామృత గుంభితములు
దీసైనపువ్వులు తెరవ తెమ్మన నవి
మన్మథమాంగల్య మందిరంబు

లనుచు గర్భోక్తులీరీతి నాడనగుచు
మాటమాటకుఁ దెగువరి మాటలాడు
పువ్వులావికలచ్చటఁ బొలుపు మిగిలి
విరులవిలిచెదరాపణ వీధులందు. ౮౪

కం. కాంచన రజితాంబరమణి
సంచిత హరిచందనాది సంపద్విభవో

డంచితమగు తత్పురమున
మించిన యౌవనము లలకమించెను సిరులన్. ౧౫

వ. ఇట్లు సకల సంపద్విభవాభిరామంబగు తత్పట్టణ మధ్య ప్రదేశం బున హేమప్రాకార గోపురాట్టాలక కుడ్యకవాట దేహళీవలభి రత్న స్తంభానేక విరచిత సాలభంజికాకలిత గారుత్మత మణిజాలక సంయుక్తంబగు హర్మ్యాభ్యంతర ప్రదేశంబున రమణీయ రత్న విరాజిత శుద్ధజాంబూనద సింహాసనంబున శ్రీమహాలక్ష్మి వార్ధి మేఖలా నితంబినీకృత సరససల్లాప చాతురీ విశేషంబుల కలరుచు విమలాదిశక్తి నివహంబును, విష్వక్సేనాది పారిషదవర్గంబును, జయ విజయాది ద్వారపాలకులును భజింప సకలదేవతా సమూ హంబులు సేవింప చెన్నకేశవరాయ దేవతాసార్వభౌముండు సుఖవిహారంబుల బెద్దకాలంబు ప్రవర్తిల్లుచుండె నని శౌనకాది మునీశ్వరులకు సూతుం డెరింగించిన ట్లా తపోధనధుర్యుం డా భూపాలవర్యునకుం జెప్పెననుటయు, ౧౬

ఉ. జలధరచారుగాత్ర నవసారసపత్ర విశాలనేత్ర ని
ర్మలవటుయోగి హృత్కమలరాజితమిత్ర రమాకళత్ర ని
శ్చలచరితా విచిత్ర రిపుసంహార శ్రీవసుదేవపుత్ర యు
జ్జ్వల శరదిందుకుంద ఘనసారయశో మహనీయ కేశవా. ౧౭

కం. కమలాఘన కుచకచభర
రమణీయ వలగ్నహస్త రంజితసత్యా
రమణీమణి హృదయేశ్వర
శమదమయోగీంద్రహృదయ సారసమిత్రా. ౧౮

మాలిని. శరధిమదవిదారీ! శత్రుసంహారకారీ!
సరసిజదళనేత్రా! చారుసత్యాకళత్రా!
సరసిజ భవవంద్యా! సర్వలోకాభినంద్యా!
సురుచిర గుణహారా! సూరిచేతో విహారా!

గద్య

ఇది శ్రీహరి గురుపాదపంకేరుహ ధ్యానానందచరిత్ర సరస సంగీత
సాహిత్య కవిత్వ రచనా విచిత్ర తిరుమంత్రద్వయ నిత్యాను
సంధాన కౌశలహృదయ సౌందర్యగాత్ర ప్రోల్లాల
గోత్రపవిత్ర కోనమదేవీ కళత్ర మోటవాడవంశ
వారాశిజనిత కైరవమిత్ర బుధబంధు సుకవిజన
స్తోత్ర రెడ్డిరెడ్డి పర్వతరెడ్డిపౌత్ర రంగారెడ్డి
పుత్ర మల్లారెడ్డి దేశాయి ప్రణీతంబైన
గంగాపురీమాహాత్మ్య ప్రబంధంబు
నందు ప్రథమాశ్వాసము.
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీ కేశవస్వామినే నమః

శ్రీమతే రామానుజాయనమః.

# గంగాపుర మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

శ్రీరమణీ కుచకుంభ
స్ఫారస్త్రీగంధలిప్త బంధురవక్షో
దారోజ్జ్వల గంగాపుర
ప్రారంజిత చెన్నరాయ భక్తవిధేయా. ౨-౦

దేవా, విన నవధరింపు మా తరువాతి కథావృత్తాంతం బెట్లయ్యె నానతిమ్మనిన శౌనకాదిమునీశ్వరులకు సకలపురాణేతిహాస కథా కథన శేముషీ సమేతుండగు సూతుం డిట్లనియె. అట్లు శతానంద నందనునకు ధర్మనందనుం డిట్లనియె. ౨-౧

గీ. రమ్యచారిత్ర గంగాపురం బనంగ
పెరిమెవరిల్లు తత్పుటభేదనంబు
దురితకోలాహలం బదేకరణినయ్యె
నమలగుణశీల నాకది యానతిమ్ము. ౨-౨

వ. అని వినయపూర్వకంబుగా ప్రార్థించిన యప్పార్థివోత్తమునకు అత్తపోధనసత్తముం డిట్లనియె. ౨-౩

చ. జనవర పుత్రభూవిభుఁడు సారవివేకము లేక లిప్సవిఁ
హింసనముసేయఁ దత్కలుషమంటిన మిక్కిలి దుఃఖితాత్ముఁడై
చనియె నశేషతీర్థముల సమ్మతిఁ గ్రుంకియు విప్రకోట్లకున్
ఘనమణికాంచనాంబర వికాసిత గోవృషభాది దానముల్,
సనయతఁ జేయఁ దద్దురితసంఘముఁ బాయక వెంటనంటినన్. ౯౪

వ. ఇట్లు చంద్రకేతుండను భూనాథుండు పశ్చాత్తాపంబున దుఃఖాక్రాంతుఁడై చింతించుచుండ నద్ధరణీవిభునకు నశరీరవాణి యిట్లనియె. ౯౫

గీ. చనుము మత్స్యపురంబున కనఘ నీవు
నచటఁ బ్రవహించు దేవసేనాఖ్యనదిలో
పొలుచు మీనాంబరంబను పుణ్యహ్రదము
నందుఁ గ్రుంకినమాత్ర నీ యఘము వాయు. ౯౬

వ. అచ్చోట లక్ష్మీవల్లభుండగు మదనవల్లభుం డధివసించియుండు నప్పరపురుషు భజించినఁ గృతార్థుండవగుదువని యాదేశించిన తద్వాక్యమ్ము లాకర్ణించి యమ్మనుజవిభుండును తత్క్షణంబునఁ గదలి కతిపయ ప్రయాణంబులఁ జనియె నంత. ౯౭

సీ. ప్రవహించు నెందేని పరమపావని గంగ
దేవసేనాఖ్య సందీప్తమగుచు
విహరించు నెందేని విమలాబ్ధికన్యకా
మహిత భోగానంద మాధవుండు
ప్రభవించు నెందేని పరుసవేదిని లింగ
పటిమఁ బార్వతిగూడి భర్గుఁడెలమి

విలసిల్లునం దేని వివిధశృంగాద్రిపై
        భర్గసీమంతిని దుర్గ వేడ్క
అటను నెం దేని మీనాంబరాఖ్యహ్రదము
అచటి కేతెంచె భూభుజుం డతిరయమున
అమ్మహా క్షేత్రవాయువు లంటినంత
బ్రహ్మహత్యోగ్రపాపంబు పరిహరించె. ౯౨

వ. ఏతత్కారణంబున త్రేతాయుగంబున తత్పట్టణరాజంబు దురిత కోలాహలంబను నభిధానంబున గరిష్ఠంబై ప్రసిద్ధినొందుచుండెనని చెప్పి వెండియు, నమ్మహీపాలుండు తత్తటినీ ప్రవాహంబున కృత స్నాతుండై తద్గిరినివాసినియగు దుర్గామహాదేవిని దర్శించి దండ నమస్కారంబు లాచరించి మణిమయాభరణాంబరంబులు సమ ర్పించి షోడశోపచారంబులం బూజించి దీపారాధనంబు గావించి పుణ్యారంద్రి జనంబులకును బ్రాహ్మణ సంఘంబులకును షోడశ మహాదానపూర్వకంబుగా విమలాన్నదానంబులు, సత్కృతులుం జేసి ఖిండి లింగంబులం బూజించి వటుకభైరవగణాధ్యక్ష మాతృకాగణంబుల భజించి యచ్చోటంబాసి లక్ష్మీవల్లభుండగు మదనవల్లభుని సన్నిధానంబునకుం జని శిరస్సాష్టాంగ దండ నమస్కారంబు లాచరించి రత్నఖచితాభరణ దివ్యపీతాంబర హరిచందన కర్పూర మృగమద కుంకుమదాగరు ప్రముఖ సకల ద్రవ్యంబులుగా నివేదించి షోడశోపచారంబులం బూజించి కృతా ర్థుండగుచు కతిపయదివసంబులు రుక్మిణీవల్లభు సేవించి తదనంత రంబు తన రాజ్యంబునకుం జని నిజరాజధానియగు నాట్యానర రంబు శుభముహూర్తంబునం బ్రవేశించి సుఖంబున రాజ్యపాల నంబు సేయుచు రంజిల్లెనని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె. ౯౯

గీ. వినుము పోయిన ద్వాపర వేళయందు
చండ విక్రమ దైత్యు లుద్దండవృత్తి
గండ కాచల ధారుణీ మండలమునఁ
బాలకుండైన నృపుసేన బారి సమరె. ౧౦౦

వ. ఇట్లు మయపుత్రుండైన దుర్జయుండను రక్షోభర్త ప్రభుసంహారంబుచేసి తద్దేశంబు పాడుగావించిన శక్రాది దేవతాబృందంబులు ప్రార్థింప వారి కభయంబొసంగి తద్దానవ వధార్థంబు తద్దురిత కోలాహలంబను పురంబు విడిచి యమ్మాదనవల్లభుండును కమలావాసిని వార్ధిమేఖలా నితంబనీరత్నంబులును, విమలాదిశక్తులును, విష్వక్సేనాది పారిషద సమూహంబులును, జయవిజయాది ద్వారపాలకులును, సనకసనందనాదులును, యోగిసంఘంబులును, నారదాది భక్తులును, పరివేష్టింప శంఖచక్రాది దివ్య సాధనంబులు మూర్తిమంతంబులై భజియింప గరుడారూఢుండై సాలగ్రామ జననకారణంబగు గండకనామపుణ్యమహాశైలంబునకుం జని ఖండన ప్రచండ చక్రధార ఘోర సంగ్రామ రంగంబున న రాక్షసవీరుల నాబాలవృద్ధంబుగా సంహరించి సర్వసర్వంసహా చక్రంబు నిరుపద్రవంబున సకలజనంబులకు పరమానందంబు గావించి తదనంతరంబున నమ్మహాశైలశిఖరాగ్రంబునం దనర్ఘ మణిమయ కాంచనసౌధరాజంబున భద్రసింహాసనాసీనుండై సుఖ విహారంబులం బ్రవర్తిల్లుచుండెనని చెప్పి యిట్లు దేవళసహితంబుగా నమ్మాదనవల్లభుండు మాయంబై చనుటంజేసి తత్పురంబు మాయాపురం బను నామంబునం బ్రశస్తంబై ప్రవర్తిల్లుచుండెనని చెప్పి వెండియు నిట్లనియె. ౧౦౧

కం. అంతట బహు కల్మష దు
ర్దాంత మహాబాధక తుచ్ఛ ధర్మవిహీన
స్వాంతావని పాలక సం
క్రాంతంబగు కలియుగంబు ప్రాప్తంబగుటన్.

వ. తద్యుగంబునందు మఱియును.

సీ. ధాత్రీసుర శ్రేణి ధర్మతపోయజ్ఞ
నిగమ శాస్త్రోక్త స్వాశ్రమలుడిగి,
మ్లేచ్ఛుల సేవించి మిత్రఘ్న బ్రహ్మఘ్న
పరధనాపహావృత్తి బఱఁగుచుండ
రాజులు తస్కరప్రాయులై లోకుల
ధనధాన్య కామినీతతులఁ గోర
క్రయవిక్రయంబులఁ గపటాత్ములై ధన
వాంఛతోఁ జెడుచుండ వైశ్యజనులు
చెలఁగి శూద్రులు శ్రుతివిధుల్ చెప్పుచుండ
దేవగృహములు వనములు తీవి చెడఁగ
మద్యపానంబు మఱి స్త్రీసమాగమంబు
కలసి వర్తిల్లు కలియుగ వేళయందు.

కం. కురియవు వానలు తఱిలో
పారి బీజములెల్ల మిగులఁ బొల్లులుగాఁగన్
గరిమెతో పంటలు పండవు
కరువులు తరుచగుచు ప్రజలు గాసిలుచుందుర్.

కం. దేవాతిథి పూజలు దమి
గావింపక విప్రులన్యకాంతా రతులన్

కావరమున సాఁగింతురు
వావిరి వర్ణాశ్రమముల వర్తన లుడుఁగున్. ౧౦౬

కం. గురు నిందింతురు శిష్యులు
తరుణులు తమ విభుల విడిచి దర్పక కేళిన్
బరపురుషులతో మెలఁగుదు
రురు సత్యవిహీనులగుదు రుర్వీజనముల్. ౧౦౭

కం. భృతకాధ్యాపకులగుదురు
క్షితి దేవత లెల్లయెడల క్షీణతరాయు
స్స్థితి రోగాదులచేఁ గడు
వెతలం గుందుదురు ధర్మవిహితచ్యుతులై. ౧౦౮

కం. ధరణీసురముఖ జాతులు
తరుణులె తమ కాపులుగను తలిదండ్రుల సో
దరులను విడిచి భుజింతురు
పరువడిఁ గావింతు రధికపాపము లెపుడున్. ౧౦౯

వ. ఇట్లఖిలధర్మంబు లోడుంగుపడుటయు పాపభూయిష్ఠంబైన కలి యుగంబునందు. ౧౧౦

కం. ఆ యుగవేళను ధరణీ
నాయక వినవయ్య విజయ నయగుణధుర్యో
పాయ పరాక్రమవంతుం
డాయత ధర పుణ్యశీలుఁ డను రాజేలున్. ౧౧౧

మ. చతురాంభోధి పరీతభూవలయ మాజ్ఞాసిద్ధి శోభిల్ల నం
చిత శత్రుక్షితినాథ వంశమకుట స్థేమాంఘ్రిపంకేజుఁ డు

ద్ధతి నైకాతపవారణంబుగ సముద్యద్విక్రమప్రక్రియో
న్నతిఁ బాలించె సమస్తభూమి ప్రజ లానందమ్మునన్ వర్ధిలన్.

వ. ఏతత్ప్రకారంబున మాయాపురంబు నిజరాజధానిగా వసుంధరా
వలయంబు కృతయుగధర్మంబుగ ప్రవర్తించుచు ప్రజాపరిపాల
నంబు సేయుచుండెనని చెప్పి మఱియు నిట్లనియె. ౧౧౩

చ. అంతట నొక్కనాఁడు వసుధామరముఖ్యుఁ డొకండు వచ్చి యే
కాంతమునందు నున్న నృపకైరవ బాంధవు ధర్మశీల భూ
కాంతునిఁ జూచి పల్కె నధిక ప్రముదాననపద్మ మొప్పఁగాఁ
గుంతుల రాజకన్యకను గోమలగాత్రిని వంక జేక్షణన్. ౧౧౪

గీ. చూచివచ్చితి నబ్బాల సుందరంబుఁ
జెప్ప శక్యంబె పెక్కేల శేషుకైన
భవునకైనను హార పద్మభవునికైన
పంచబాణునికైనను పార్థవేంద్ర! ౧౧౫

గీ. కంతు మోహంపు పట్టంపు దంతి కాంతి
క్రొమ్మెఱుంగుల దొంతి యక్కమ్మవిల్తు
కొమ్మపూబంతి యాయింతి కువలయేశ!
నీకెతగు దీవు తగుదు వా నెలఁతకరయ. ౧౧౬

గీ. చంద్రవంశావతంస! యా చంద్రవదన
స్మరపునర్జీవ సంజీవ కరణి తరుణి
సకల సౌందర్య లావణ్యజలధి వేల
లలిత కందర్ప సామ్రాజ్యలక్ష్మి నావె! ౧౧౭

గీ. దాని జన్మప్రకారంబు మానవేంద్ర! .
వినుము చెప్పెద నీకు సవిస్తరముగ
కుంతలాధీశుఁ డరి రాజ కుంభి సింహుఁ
డమలగుణశాలి వీరవర్మాఖ్యుఁ డవని. ౧౧౮

గీ. అతని ప్రియకాంత పుల్లపద్మాయతాక్షి
మదన చింతామణి యనంగ సవమలాంగి
సైకతశ్రోణి మత్త షట్చరణవేణి
కిసలయారుణపాణి సత్కీరవాణి. ౧౧౯

వ. ఆ మానినిఁ గూడి వినోద లీలా విలాసంబున పెద్దకాలంబు విహరించి. ౧౨౦

కం. తనయులు పుట్టమి జనపతి
వనితామణిఁగూడి తపము వదలక సేయున్
వనజజుఁడు వచ్చి మెచ్చుచు
మనుజాధిప వేడు వరము మసలక నిత్తున్. ౧౨౧

కం. అని పద్మజుండు పలికినఁ
గనుఁగొని సద్భక్తి మ్రొక్కి కాంతయుఁ దానున్
గనుఁగవ నానందాశ్రులు
ఘన పులకితగాత్రులగుచుఁ గడు మోదితులై. ౧౨౨

కం. కరకంజాంజలిపుటులై
కరుణాకర! లోకనాథ! కమలజ! మాకున్
వరతనయుల దయసేయుము
వరమది మాకనిన (భక్త) వత్సలుఁడనియెన్. ౧౨౩

కం. సుతయుగళము కన్యామణి
క్షితలాధిప! కలుగు నీకుఁ గోమలియందున్
క్షితి పాలింపఁగఁ జనుమని
శతమఖముఖ సురలుఁ గొల్వ జలజజుఁడరిగెన్. ౧౩౪

వ. ఇట్లు శతానంద వరప్రసాదలాభమున నా తేఁడు పరమానంద హృదయారవిందుండై సుందరవదనా సమేతుండగుచు నాత్మీయ రాజధాని యగు కౌంతలకరి నగరంబున కరుగుదెంచి దివిజేప్సితంబుగ సకలసామ్రాజ్య పరిపాలనంబు సేయుచు నమ్మదనచింతామణీలలామంబుతో కేళీవిహారంబుల సుఖంబునఁ బ్రవర్తించుచుండె; నంత కతిపయదినంబులకు పద్మజ వరప్రభావంబునఁ బద్మగంధి గర్భంబు వహించెనని చెప్పి యా యశ్వోధమునకు వత్తిపోవర్యుం డిట్లనియె. ౧౩౫

కం. నెల లిటు లేఁడెనిమిది నన
పాలుపొందుచు సతికి మిగుల ప్రొద్దులనెల నిం
పలరఁగఁ బ్రొద్దులు నిండెను
విలసిల్లెను గంబుకంఠి విమలప్రభలన్. ౧౩౬

వ. శుభగ్రహపంచకంబును స్వస్థానంబుల సంపూర్ణ దృష్టిం జూడ శుభలగ్నంబునఁ గుమారుం గనియె. అయ్యవసరంబున నొక్క కాంతాలలామం బేతెంచి పుత్త్రుండు జన్మించెనని చెప్పిన జనపతి తద్వధూరత్నంబునకు భూషణాంబరము లొసంగె.

అనంతరము మంగళస్నానంబొనరించి గంధాక్షత పుష్పాంబర మణిభూషణాలంకృతుఁడై పుత్త్రి ముఖావలోకనానంద(దము నను భవించి) బ్రాహ్మణ సమూహ మధ్యప్రదేశంబున సుఖాసీనుండై

పురోహితునకు కట్నంబొసంగి షోడశ మహాదానంబులొనరించి మణియును గోధేను సహస్రంబులను, ధనధాన్య రత్నాంబర భూషణంబులను సభార్యులగు బ్రాహ్మణోత్తముల కొసంగె. వెండియు కవి గాయక వందిమాగధ వాహ్యాళిక వాఁశిక వార నారీజనాదులకు వసదనంబు లిచ్చె. పుత్రోత్సవం బివ్విధంబునఁ గావించి యా భూకాంతుఁడు పుత్రునకు శత్రుజయుం డని నామ కరణంబు చేసె. ౧౨౭

కం. శతధృతి వర వైభవమున
కుశలాశిపుకూర్మి వనిత గొబ్బునఁ గర్భం
బతులిత లీల వహించెను
పతి కనురాగంబు మిగుల ప్రబలఁగ మరలన్. ౧౨౮

కం. తొమ్మిదినెల లరిఁగిన నా
కొమ్మయు శుభలగ్నముననుఁ గొడుకునుఁ గూతుం
నెమ్మి: బ్రసవించె; భూపతి
క్రమ్మరఁ బుత్రోత్సవంబు రంజిలఁ జేసెన్. ౧౨౯

గీ. ధారుణీశుండు తనయుని వీరసేనుఁ
డనుచుఁ గూఁతును సుప్రభ యనుచు వరుస
నామకరణంబు లొనరించెఁ బ్రేమఁదనర
వారు కవఁగూడి పెరిగిరి వసుమతీశ! ౧౩౦

వ. ఇట్లు క్రమక్రమంబున ప్రవర్ధమానులగు నక్కుమారీ కుమారులను పురోహితుండగు బ్రహ్మశర్మకు నప్పగించిన నతండు వారలకు సాంగంబుగా వేదశాస్త్రంబులును, ధనుర్వేదాది సమస్త విద్యలు నుపదేశించియు, కరి హయ రథారోహణ సంగ్రామంబు

తెఱింగించిన వారును సకల విద్యావిశారదులగుచు తల్లిదండ్రుల నతులానందసందోహాకలితాంతరంగులఁ జేయుచు ప్రవర్తించుచుండిరి. అక్కన్యకారత్నంబును నాటకాలంకార సంగీత సాహిత్య వీణావాదనాది సమస్త విద్యావిచక్షణయు వినయవతియునై ప్రవర్తిల్లె. (క్రమముగా) నబ్బాలికారత్నంబునకు బాల్యము వీడి జవ్వనంబు ప్రవేశమగుటయు జననీ జనకులకు నయనానందకారిణి యగుచు నా కన్య విలసిల్లె. ౧౩౧

కం. మిసమిస తనులత మెఱసెను
ముసిముసి నవ్వులును సిగ్గు మొగమునఁ దనరెన్
వెస మొలకలెత్తెఁ జనుగవ
పసలెక్కెఁ గపోలయుగళి బాలామణికిన్. ౧౩౨

ఉ. నేరెటి వాగుపంకమును నిద్దపుకారు మెఱుంగుదీవెలం
భోరుహాసంభవుండు దగ ముద్దగఁ జేసియు వన్నెలెక్కఁగా
సారసుధారసంబు పయిఁ జల్లుచుఁ జేసెనొ దానికాంతి వి
స్ఫారిత సుప్రభాహ్వయము పాటిలునెట్లిటు గాఁక తక్కినన్. ౧౩౩

చ. శివుశిర మెక్కినంతటనె శీతకరుం డెనవచ్చునెట్లు త
త్ప్రవిమల సద్వధూవదనపద్మముతో బహుళార్తి ఖేదమున్
దవులక రాహుఘాతలకు తద్దయుఁ జిక్కక లోఁ గలంక మ
ట్లవిరళవృత్తిఁ బూనకటు లారయ వర్థిలఁ జేసి సొంపుగన్. ౧౩౪

గీ. చాన బొమదోయి గనుపట్టె శంబరారి
చాప వైఖరి; రెప్పల చంద మమరె
కుసుమశరు తుమ్మెదల నారి గొనబుమీఱి,
కన్నుఁగవ మించె మరుబాణకలనఁ దెగడి, ౧౩౫

కం. తమ్ములు రేజీకటి కుము
దమ్ములును దివాంధములునుఁ దరుణీమణి నే
త్రమ్ముల కెనవచ్చుటకై
నెమ్మిమయిం దపముచేసె నీటిలొ మిగులన్. ౧౩౬

గీ. సకియ వేణీభరంబుతో సాటిరాక
సారె నాయింద్రమణులెల్ల పూరిగఱిచె
లీల భృంగాళి తమ్మిగోళాల డాఁగె
బర్హిబర్హంబు లేపాటి పార్థివేంద్ర ! ౧౩౭

కం. మనసిజుని వీరశంఖం
బనయము సతి కంఠమునకు నారయ సమమా
పెనుబొబ్బలిడక మృదుల
స్వనమబ్బినయేని చూడ సౌష్ఠవగరిమన్. ౧౩౮

గీ. కలికి వదనారవింద వికాసపటిమ
కులుకుచూపుల బెళుకుల తళుకులలమ
బాల చెక్కులు గనుపట్టెఁ బంచశరుని
వడిగలకుఁ జేయు బంగారు పలకలట్లు. ౧౩౯

గీ. దాడిమీబీజకాంతుల ద్రస్తరించి
కుందకుట్మల దీధితుల్ కిందుపఱచి
హీరపంక్తుల సౌష్ఠవంబెల్ల మిగిలి
తరుణి రదనంబు లెంతయుఁ దనరెఁ జూడ. ౧౪౦

గీ. విద్రుమశ్రీలు మిక్కిలి వెలసెనేని
కఠినములు గాక మార్దవగరిమఁదనర

చిన్కులను గాక యమృతంబు సిందెనేని
వనిత కెమ్మోవి కెనవచ్చు వైభవమున. ౧౪౧

కం. పంచాగ్ని మధ్యసీములఁ
గొంచక తపముండి కనకకుంభంబుల యా
చంచలనేత్ర కుచంబుల
నించిన సిరి నెనయలేక నీళ్ళనుమోసెన్. ౧౪౨

గీ. చిగురుటాకుల పువ్వుల చెలువు మిగులు
పారిజాతంబు లతలన ప్రభలఁదనరి
బాలికామణి నును బాహుపాణియుగము
నంగుళుల రత్నముద్రికల్ రంగులీను. ౧౪౩

గీ. పసలు పొడిరాలు కక్ష్య వైభవము సొంపు
దర్పకందర్పుచే మించు దర్పణముల
సిరుల నిరసించు మిక్కిలి సిరులఁ దనరె
బాహువల్లుల కొనరించు పాదులనఁగ. ౧౪౪

గీ. యవ్వనాంభోధి తరగలఁయలవు మిగిలి
నాతి వళులొప్పె నావర్తనాభి తనరె
నింద్రనీలశలాకన నింపుమీఱె
లలిత నవరోమరాజి విలాసమమరె. ౧౪౫

చ. ఘన కుచకుంభభార మధికం బది యోర్వమి కౌనుసూక్ష్మమం
చనయము పద్మయోని దివిజాధిప రత్నశలాక తార్చనాఁ
దనరెను రోమరాజి విదితంబుగ తామరకొల్ను రీతి న
ట్లొనరె గభీరనాభి విమలోజ్జ్వల పద్మదళాయతాక్షికిన్. ౧౪౬

గీ. పద్మదళనేత్రి నాసికాపటిమ సొబఁగు
గంథఫలి నవ్య సౌందర్యగరిమఁ దెగడి
మదన తిలపుష్ప తూణీర మహితకాంతి,
పరిహసించెను మౌక్తికాభరణ రుచుల. ౧౪౭

గీ. భవ్య శ్రీకార రేఖల ప్రభలు మిగుల
రత్నతాటంక కాంతుల రమ్యమగుచు
విద్రుమాధర కర్ణముల్ విశదమయ్యెఁ
బంచసాయక రథచక్ర పటిమఁదనర. ౧౪౮

గీ. భామకెనయైన యువతు లీ పద్మభవుని
సృష్టి లేరని మదనుండు చెలఁగి వ్రాయు
బంగరపు పట్టికన మించె ఫాలసీమ
లేమ ముత్యాలబొట్టు త ల్లిఖితమనఁగ. ౧౪౯

గీ. కలదు లేదను సంశయకలనఁ దనరెఁ
గాంత లేఁగౌను జూచుచో గగనమగుచు
శంబరారాతి మోహన చక్రమనఁగ
కరము శోభిల్లె జఘనంబు కంజముఖికి. ౧౫౦

గీ. కాంతు మోహన తటినిలోఁ గరము మెఱయు
సైకతాభోగ జఘనంబు చాన కలరె
రత్నకాంచన కింకిణీ రశన మెలమి
మ్రోసె మన్మథ జయవాద్యమో యనంగ. ౧౫౧

గీ. గంధగజయాన యుత్తుంగకాండమునకు
కంతు సామ్రాజ్య గంధేభ కరము లహహ !

సరిసమానంబు లనరాదు సాంద్రకాంతి
పుంజ మబ్బమి వరుసనె ముఖుచు కతన.

గీ. జానుజంఘుంబు లలరెను శంబరారి
మహిత తూణీరయుగళ సమగ్రరుచుల
కుసుమకోమలి గుల్ఫముల్ కొమరు మిగుల
బంగరపుపూవు పెంట్లను రంగులెసఁగ.

గీ. ప్రమదయుగళంబు కచ్ఛపపటిమ దెగడు
నంగుళంబుల కాంతులు నతిశయిల్లె
చుక్కచాలన నఖరాజి సొబఁగుమీఱె
జలరుహాయత నేత్రకు జనవరేణ్యా.

గీ. కిసలయారుణకాంతులఁ గ్రిందుపఱచి
పద్మమత్స్యాది రేఖలఁ బరిఢవిల్లి
బాలపద తలయుగళంబు శ్రీలఁదనరె
పగడములడంబు మడిమల జిగియు మిగిలి.

కం. అంగజ రతి సతి కేళీ
శృంగార వనంబులోనఁ జెలువొందిన యా
బంగరు పరిటా కనఁ గడు
రంగుగఁ జరమాంగ మమరె రామామణికిన్.

గీ. ఇట్టి సౌందర్యఖని యైన యింతి నీకు
నబ్బెనేనియు నీభాగ్య మబ్బు టరయ
అలరుబోఁణికి నీవు న ట్లబ్బితేని
భామినికిఁ బుణ్యమబ్బుట పార్థివేంద్ర!

గీ. కంఠసీమను శంఖ విలాస మమర
పద్మకచ్ఛప పటిమయు పదతలముల
నవనిధానము ల సుకాంతి యవయవముల
నలమియఖిల సౌభాగ్య మెన్నవశమె. ౧౪౮

ఉ. చక్కని ముద్దుచెక్కులును జంద్రనిభానన మబ్జనేత్రముల్
చొక్కపు(గ్రొమ్మెఱుంగులను సుంకముబట్టెడి దేహకాంతులున్
నిక్కగు గుబ్బచన్నులును నిగ్గులమోవి దరస్మితంబు పెం
పెక్కిన నీలవేణియు మదేభసుయానము పద్మగంధికిన్. ౧౪౯

వ. రమణీమణి యనందగు నబ్బాలామణినిఁ బరిణయంబై సమస్త భోగంబు లనుభవింపుచు 'శుభస్యశీఘ్రమం'బను నీతివాక్యంబు లెఱిం గినఁ జతురుండ వని పలికి వెండియు 'క్షిప్రమేవ వివాహసిద్ధి రస్తు'ని యాశీర్వాదంబు లొనరింపుచుఁ దాంబూలపురస్సరంబుగా తదామంత్రణంబువడసి డెందంబలర ధరణీబృందారకపురందరుం డాత్మీయమందిరంబున కరిగె.

తదనంతరంబ యాభూపాలోత్తముండు తనచిత్తంబు మన్మథాయత్తంబగుటయు నాత్మగతంబున నిట్లని వితర్కించె. ౧౫౦

ఉ. అక్కడికేలపోయె వసుధామరముఖ్యుఁడు పోయిపోయి యా
చొక్కపు రాజకన్నియను జూచెనదేటికి? (జూచెచూచి దా
నిక్కుచు కాంతరూపు కమనీయవిలాసము లేలచెప్పె నన్
(గక్కునఁ బుష్పసాయకుఁ డకారణమేటికి నేఁచె న్యగ్రుఁడై. ౧౫౧

వ. అని చింతాక్రాంతుఁడై తర్కించుచుండె నంత నపరాహ్ణంబయ్యె నట్టి సమయంబున తత్పుటభేదన వారసుందరీసందోహంబులు

స్రక్చందన రత్నఖచిత విభూషణ దుకూలాంశుక చిత్రాంబర కార్పాసాలంకృతులై తమ సౌందర్యలావణ్యవిలాసవిభ్రమవిశే షంబులు జనంబుల మోహపరవశులం జేయుచు దమ తమ గృహ ద్వారంబుల నిలిచి రందు కొందఱు తీర్చిన పంచల చంద్రికాంత వేదికాస్థలంబుల చిత్రకంబళాస్తరణమధ్యప్రదేశంబుల వివిధంబు లగు జూదంబులాడుచు దర్పకందర్ప సుందర పాంచాలికల చందం బున రంజిల్లి రట్టిసమయంబున ౧౬౨

సీ. వృత్తికా భుక్త నిర్ముక్తచీనాంశుక
పుష్పదామంబులు పొసగఁదాల్చి
కంచుకశ్రేణిలో నించుక నిల్వక
ప్రోల్లంబకుచములు పొరలియాడ
తెరవాటి యొక్కలి దేవికి ప్రియమైన
తోలుపాదాలతన్ తోరముగను
బోసినోళ్ళను బోంటుపోకవ్వాలవిగొన్ని
వాడినయాకుల వీడెములును

గీ. మాటమాటకు (ఁదుంపరల్ నోటవెడల)
మద్యపాన మదావేశ మానహీన
లూఁత కోలల నూనుచు నుగ్రపాప
భాజనంబగు వృద్ధవేశ్యాజనంబు. ౧౬౩

వ. ఇట్లే తెంచి తమతమప్రాయంపుబిడ్డల నికటప్రదేశంబులంగూర్చుండి మున్ను తమచేత సకలవిత్తంబులుం దోపుడువోయి పేదలైన విటులం గని నంత గర్జన తర్జన తాడనాదులభంగించి వెళ్ళదోలిన

మోహపరవశులై పోవంజాలక మోహంబులంజూచు వాంఛల నింతంత సంచరించు విటులం జూచినంతమాత్రంబున తపశికంజ లట్ల రోషావేశభీషణాకారంబుల గుట్టునుచు కరవంబోవుచండం బున ఘుర్ఘురధ్వనులెసంగ దండంబు లక్కించుచు దండించుచు ఝుంకించుచు సిగ్గుమాలిన మొండితోఁక పొమ్మనుచు తోలు చుండెడివేళల భాగ్యవంతులైన శిష్యసంఘంబులు చూడవచ్చిన టక్కరిచేతల నక్కవినయంబుల మ్రొక్కుచు తమతమ పుత్రికా నికటప్రదేశంబులఁ గూర్చుండఁబెట్టుక ప్రక్చందనతాంబూలంబు లొసంగి బెల్లిమాటల సంతుష్టితస్వాంతులం జేసిన వారును చేజె ఉుంగని కూనలై తాము దెచ్చిన సంకుమద మృగమద హరి చందనాది దివ్యపరిమళద్రవ్యంబులును చిత్రచేల కార్పాస రత్న ఖచితాభరణంబు లొసంగియు రోపాటు గద్యానంబులెంచక కొంచక కుచకుంభోపరి చేలాంచలంబుల నించిన వీక్షించి మెచ్చుచు పొంగి విటశిఖామణులైన మీరు మాగృహంబులకు వచ్చుటయే పదిలక్షు లీవులేమి కారణంబులనియూరడింపుచు ప్రవ ర్తిల్లుచుండి రట్టి సమయంబున ౧౬౪

శా. కాలవ్యాధుఁడు వెంటనంటి తరుమన్ గంజాప్తసారంగమున్
చాలండవ్వగనేగ తీవ్రశరమున్ సంధించి బెట్టేయ న
ట్లోలిం బశ్చిమవార్ధివాలునటులీ యుగ్రాంశుఁడుంగ్రుంకె, ద
త్కీలాలంబన సాంధ్యరాగమమరెన్ కెంపెక్కి నల్దిక్కులన్.

చ. వనరుహబాంధవుం డపరవార్ధిలొగుంకినఁ దత్కరాంశముల్
ఘనతరలీలఁగ్రమ్మ్మ నవకప్రభ పశ్చిమదిక్కలాపమై
సనయుతఁబర్వినట్లమరె సాంద్రతరోజ్జ్వల సాంధ్యరాగమున్
తనరెను దీపమాలికలు తద్దయుమించెను గేహసీమలన్. ౧౬౬

కం. దోషంబునకను దేశిక
దోషాసంగంబుచేసి యుగ్రశిరోగ్ స
ద్భూషణమగు శశిచూడను
దోషంబనుపగిదిమునిఁగెఁ దోయజవితతుల్. ౧౬౭

చ. వనరుహగర్భగోళముల బంభరజాలము లంతడాగెఁ ద
ద్వనగజయూథము న్వడలె దరవమెలర్పఁగ ఘూకసంఘముల్
ఘనగుహ చెంతవీడ నటు గ్రక్కునపక్షులు గూళ్లుసేరెఁ జ
య్యన మతిచక్రవాకచయ మల్లనఁబాసె మహార్తిదూలుచున్.

కం. తతి పశ్చిమ దిక్కామిని
చిఱుసిగ్గునఁబోలె సంజచీకటి నెరిసెఁ
వరుఁడగు శశిధరుఁడంపిన
సురుచిరమౌక్తికములట్ల శోభిలెఁజుక్కల్. ౧౬౯

ఉ. అంత దినావసానసమయంబున భర్గుఁడు తాండవింపఁగా
స్వాంతవిజృంభణభ్రమణసంభ్రమ మొప్పఁ దదీయ (వక్త్రి)సం
క్రాంతకరాళహాలహాలకాంతులునిండఁగఁ బర్వినట్లు న
త్యంతమహాంధకారపటలావృతమయ్యె జగంబు లోక్కటన్. ౧౭౦

గీ. ప్రబలఁజీకటి సంకేతభవనములకు
మరుఁడు పేరిరేప నించుక వెరపులేక
వేడ్కలిగురెత్తఁ జేరియు వింతగాఁగ
జారిణీ జార జనరతుల్ సంఘటిల్లె. ౧౭౧

వ. అట్టి సమయంబున ౧౭౨

మ. కటికింజీకటి జారభర్తకడకుం గంజాక్షి యొక్కర్త యు
త్కట వేగంబున నేగనంత నొకతా తన్వి న్విలోకించి యా
డట నిల్లెగెద వొంటిగాఁడె? యన మందస్మేరవక్త్రాబ్జయా
నట కందర్పుఁడధిజ్యధన్వియగుచు న్నాకింటరా నొంటిమే?

గీ. శంబరారాతి దూతట్లు సంభ్రమింప
ప్రబల (తమమున) నొక్కతె పాదయుగళి
కాంతులట త్రోవఁజూపఁగఁ గాంతుమిగుల
జారుకడ కేగి రతికేళి సలిపెనపుడు.

సీ. జారభర్తను నొక్కచాన సంకేతింపఁ
దత్సతి యదిచెప్పి తాను పతికి
కటికిచీకటి వేళ కాంతుఁడచ్చటి కేఁగఁ
దరుణియెఱుంగక తానుజనియు
జారభర్తని సతి జారిణియని భర్త
కంతుసంగర కేళికలనఁ దేలి
మాటలవెంబడి మదిరాక్షినాలని
నిజనాథుఁడగుటయు నెలఁత యెఱిఁగి
వచ్చితిటకెట్టులన నీవు వచ్చుటెరిగి
దాని నినుబట్టుకొనవచ్చి తగిలితింతె
మాను మిటువంటి దోసంపు మాటలనుచు
కంటకములాడి యాగొంటె యింటికరిగె.

ఆ.వె. మగని నిద్రబుచ్చి మగువ జారునిఁ బొంది
తిరిగివచ్చినంతఁ దెలిసి విభుఁడు
ఎచటికేఁగి తోసి యింత ప్రొద్దున నన
వదినె పిలువఁబోయి వచ్చితనియె.

గీ. గుళ్ళపంచల పాలిండ్ల కొట్టములను
పసులగాళ్ళను కుంటెన పడతులిండ్ల
జారిణీ జారనివహంబు శంబరారి
కేళులను దేలి జని రాత్రి గేహములకు.

చ. శివు తలమెట్టి పుల్లసరసీరుహ సంపద కొల్లపెట్టి కై
రవముల వన్నెఁబెట్టి భ్రమరంబుల బందికిఁబెట్టి జారిణీ
యువతుల మొట్టి కోకముల యొద్దికలెల్లను పానబట్టి యు
త్సవమునఁ జంద్రమండలము సయ్యనఁదోఁచెను తూర్పుదిక్కునన్

ఉ. ఆకస మొప్పెఁజూడ మరుఁడాతత లోకజయార్థమేఁగఁగాఁ
గైకొను నీలిగోలయన కంబము మేరునగంబు చంద్రుఁడున్
జేకురు దర్పణంబు సవిశేష సుతారక మౌక్తికావళిం
బ్రాకట శుభ్రరశ్మిచయబద్ధవిశోక్యవిరాజమానమై.

గీ. సాంద్ర చంద్రాతపస్ఫూర్తి సంఘటిల్లఁ
బద్మగర్భాండ మొప్పెను బంచశరుఁడు
వచ్చునని పూర్వదిక్సతి వన్నెకెక్కఁ
బాల సున్నంబుచేసిన లీల లమర.

సీ. నునుసోగ వెన్నెలల్ మునుపు పిల్లలపోను
మెదిచి మేఁతలు పెట్టి పొదలునవియు
గుజ్జువెన్నెలలెల్ల సజ్జగాఁ గావించి
కోరి పురుషులపొత్తు గుడుచునవియు
పండువెన్నెలలెల్ల బాంధవశ్రేణితో
పండువుల్ గావించి ప్రబలునవియు
ముక్కులబంటిగా మెక్కి యన్నెక్కియు
మన్మథ క్రీడల మలయునవియు.

గీ. సాంద్ర చంద్రాతపోదార సరసి మెఱసి
సారె జలకేళిఁ దేలుచు సంభ్రమించి
( ... ... ... )
సిరులు మిగులఁ జకోరముల్ చెంగలించె.

అది మఱియును సుధార్ణవంబు పెల్లుబ్బి వెల్లివిరిసి నిట్టవొడచిన చందంబున, మీనకేతనయశశ్శర్వ్వారిపరాగంబు నించిన జాంబూనద కరపటంబు కైవడి, పద్మజాండంబు నివ్వటిల్లియు పట్టఁజాలక పిక్కటిల్లు సాంద్ర చంద్రాతప పరిపూర్ణంబై రంజిల్లె నట్టి సమయంబున.

కం. వారవధూటులు తమ తమ
చేరిక భుజగులనుగూడి చిత్తములలరని
మీరిరి సౌధాగ్రంబుల
వారక వివిధాసవముల వైభవ మెసఁగన్.

నీహారమిళిత మృగమదాలేపన స్థలంబుల నానావిధ రంగవల్లీ విరచిత పుష్పాస్తరణ ప్రదేశంబుల తత్పూరిత ఘటంబులు నిలిపి బహువిధ పరికరమిళిత సుపక్వంబులగు గుంటెటి కణ్ణుకట్లును, కుక్కుటాండంబులును, జంబీరస తైలాభిషిక్తంబులును, తిలసర్షపరామఠ మరీచికా శృంగిభేది ప్రముఖోపరికరకలితంబులగు పండివాళ్ళు మొదలైన ఖాద్యద్రవ్యంబు లొడంగూర్చి కూర్చుండి గారుత్మత భవకంబులు మంచి మంచి పానంబులు సేయుచు పానఖాద్యశేషంబుల చవు లుగ్గడింపుచు విట విటీజనంబు లొండొరుల కొసంగుచు మదావేశభరంబుల నిబ్బరంపు టుబ్బుగబ్బిగుబ్బలు రంజిలి బిగియ కౌఁగిళ్ళంజేర్చి యితరేతరాధర సందష్టంబులు సేయుచు

తబ్బిబ్బుమాటల వెడవెడ తందనాలుంబాడుచు లాస్య నైపుణ్యంబులు మఱచి వెఱ్ఱిత్తినరీతి గంతులు వైచుచు చంద్రికా వికసనంబుల తమనీడలంజూచి యోరి! నన్నుగాదని వేరొక్క గుబ్బలాడిని తెచ్చుకొన్న వాఁడవని కినిసి టుటూరంబులాడిన వాఁడును తనఛాయ బిట్టుచూచి యోపోసి వాఁడ స్త్రీలను నమ్మరాదను మాట నిక్కంబయ్యె మిక్కుటంబగు మక్కువ పిక్కటిల్ల నొక్క విటునిం దెచ్చుకొన్న జాణవని తిట్టుచు లేదు లేదు కాదు కాదని జగడింపుచు కుతుకంబున కంతుకలబట్టి యథేచ్ఛంబుగా పానంబు సేయుచు కొంతసేపిట్లు విహరించి దర్పించి కందర్ప కేళీవిలాసంబుల ప్రవర్తింపందొడంగి రని చెప్పి వెండియు

చ. వనితయొకర్తు మూఢ పతివంచన నిద్దురవుచ్చి ప్రక్కలో
తనరఁగఁ దొత్తునుంచి ప్రముదంబునఁగూర్చు భుజంగవర్యుతో
సనయుత పుష్పబాణ ఘనసంగర కేళి యొనర్చె కామినీ
జనముల మాయలం దెలియ శక్యమె యెయ్యెడ నెంతవారికిన్

చ. స్మర రణకేళిఁ దేలుతఱిఁ జాన రసజ్వాలమైన రక్తమున్
గరము స్రవింపఁ బంచశరు ఖడ్గముదాఁకిన జారునట్లుగా
స్ఫురణను నాథువక్షమున సుందరి వ్రాలినఁజూచి కూర్మి వే
మరు రదనాంశుకామృతము మచ్చిక నిచ్చియు దేల్చె కామినిన్.

ఆ.వె. ఒకని నిద్రవుచ్చి యొక్కనితోఁ గూడి
మఱియు నొకనిఁగలిసి మలసి చెలఁగి
మదనకేళిఁ దేలు మగువల మాయలు
వనజభవునకైన వశమె తెలియ.

సీ. కసువాయి యుగముల కంఠనినాదముల్
పటుశారికాకీర భాషణములు
కలహంసక్రేంకార కలకలస్వనములు
కలకంఠపంచమగానపటిమ
పల్కుపాన్పనమించు గుల్కురవంబులు
తరుణుల రతికూజితముల సొబఁగు
మగువలపాలయల్క మాన్పువిటశ్రేణి
యనునయాలాపంబు లతిశయిల్లి
గీ. బహుళమయ్యును రోదసీ కుహరములను
బిసరుహాప్తులం నుంగడిపేటయనఁగ
సిరులు తళుకెత్తనెంతయుఁ జెలువమగుచు
వెలసె నవ్వేళనవ్వీటి వేశవాటి.

అని చెప్పి వెండియు

ఉ. అంతకుమున్ను భూరమణుఁ డంబుజపత్ర విశాలనేత్ర వృ
త్తాంతము విప్రుచే వినుచు నంబుచరధ్వజ మోహనాస్త్ర సం
క్రాంతమనస్కుఁడై మిగుల గాసిలుచుండుటఁ జంద్రబింబమ
త్యంతదవానలస్ఫురణఁ దాప మొనర్చిన వంత గుందుచున్

కం. ఆరమణి మోహనాకృతి
వారక యచ్చొత్తినట్లు వదలక మదిలోఁ
గూరిన విరహాభరంబున
ధారుణి పతి ధైర్యమెడలి తహతహలెసఁగన్.

గీ. విరహభరమున మాటికి వేగి వేగి
రాజ్యభారంబు విడిచి యారాజవరుఁడు

కంజదళనేత్రి వసంజిక్కి కంతుబారి
కగ్గమయ్యెను నెంతయు నవనినాథ.

గీ. మదను మాయాంధకార నిర్మగ్నుఁడగుచు
మానినీమణి సౌందర్య మహితమూర్తి
మానసంబున నెన్నొల్ప మనుజవిభుఁడు
రాజభోగంబులందు విరక్తుఁడయ్యె.

గీ. సంతత ధ్యానవశమునఁ జంద్రవదన
యెదుట నిల్చిన యట్లైన ముదము మిగుల
లేచి పట్టంగఁబోయిన లేమ లేమి
కళవళింపుచు ధారుణీకాంతుఁడపుడు.

కం. పలుకవె చిలుకల కొలికీ!
కలయఁగ ననుజూడగదవె కన్నులకలికీ!
వలరాయుని పూములికీ!
మెలుపునఁ గెమ్మోవియీవె మించులబెళికీ!

గీ. దర్పకందర్ప సర్పసందష్టు నన్ను
నధర సుధలిచ్చి మనుపవే యంబుజాక్షి!
ప్రాణరక్షణమెంతయుఁ బరమధర్మ
మనుచు శ్రుతులాడు వాక్యముల్ వినవెయువతి?

సీ. నినుజూడఁగోరెడు నేత్రోత్పలాళికి
వదనేందుచంద్రిక వాడుదీర్పు
నీమోవిసుధగోరు ప్రేమనాజిహ్వకు
నధరామృతంబిచ్చి యాదరింపు

నీబాహుపరివేష్టి నిరతంబుగోరెదు
నాదేహశశికి నానందమొసఁగు
వనిత నీకుచచక్రవాకద్వయంబు నా
హృత్సరోవరసీమ నీడఁజేయు

గీ. అనుచునీరీతి విరహార్తుఁడగుచుబల్కు
పువ్వుగుత్తులువీక్షించి పువ్వుగంధి
పటువు గుబ్బలటంచును బట్టఁదివిరి
కాకతక్కిన మిక్కిలి కళవళించు.

అయ్యవసరంబున.

కం. మరుఁడేయ మోహనాస్త్ర
స్ఫురణంబున వగలు మిగుల శోషితతనుఁడై
వెఱగొందు విహ్వలించును
తరుణీమణిచిత్తసీమఁ దగిలిన కతనన్.

ఇట్లు డోలాయమానమానసుండగుచు మన్మథు నుద్దేశించి యిట్లనియె.

సీ. నిను నీరుసేసిన నీలకంఠుఁడఁగాను
మదన నాతో నేల మచ్చరింప?
నిను బట్టు సింహికాతనుజాతుఁడనుగాను
చంద్ర నాతో నేల చలముసేయ?
మిము మాఱఁగలుగఁ దిట్టు మేటి రాముఁడఁగాను
కోకిలా! నామీఁదఁ గూయనేల?
నిను మ్రింగు భుజగేంద్ర నేతను నేగాను
దక్షిణానిలమ నన్ దరమనేల?

అనుచు నీరీతి నలవిల్తు నతని మ్రాఁకు
నోలి కోయిలగుంపుల నాలిగాలి
భూభుజుఁడు దూరు నాత్మనా పొలఁతిఁగోరు
నెంత వాఁడైన మరుతోడి వంతగాఁడె!

ఇట్లు వేదనాభరంబున డోలాయమానమానసుండై వితర్కించుచుండె నంత; అక్కడ కుంతలవసుధాధ్యక్షుండగు వీరవర్మ కన్యాలలామం బును గతాగత బ్రాహ్మణ జనంబులవలన పుణ్యశీలక్ష్మాపాలు సౌందర్య లావణ్య గాంభీర్య చాతుర్య సౌశీల్యాదివిశేషంబు లాక ర్ణించుటంజేసి వినుకలివలన వలవంతలం దవిలి యయ్యిందువదనా శిరోరత్నం బా రాజపురందరునందు దవిలి డెందంబు డిందుపఱుప నేరక సఖీబృందంబుల వంచించి మందిరోద్యానంబునకుం జనియె నంత

సీ. వేడివెన్నెలసోఁక విరహాగ్నిలో నేయి
వేల్చి నట్లైనను వెఱచివెఱచి
ఘనరసాలచ్ఛాయఁ గడకేఁగ నచ్చోటఁ
బికనినాదములకు బిట్టుచెదరి
మల్లికాకుంజంబు మరువునకరిగిన
షట్పదార్భటులకు జడిసి జడిసి
అటవాపికాసారతటముల కెట్టుజన
కలహంస క్రేంకారములకుఁ దలకి

గీ. మంజులాశోక మాధవీ మంటపముల
దరియఁ దత్పుష్పములు మరుశరములైన
వగలు మిగులంగ నటు వగవారినడుమఁ
జిక్కినట్లయ్యె మిక్కిలి చెలువకపుడు.

కం. చిలుకలు పూన్చిన యరదము
మెలువగు మీనధ్వజంబు మిక్కిలి మెఱయున్
వలరేడు చెఱకుల విలుగొని
కలరవభేరులును మెరయ గర్వస్ఫూర్తిన్.

శా. ప్రత్యాలీఢ విలాసవై ఖరుల శుంభన్మోహనాస్త్రంబులౌ
చిత్యస్ఫూర్తి పరాక్రమప్రకట సుస్థేమోగ్రబాహాబలౌ
ద్ధత్యోదంచిత లీలలొప్ప శరసంధానంబు శోభిల్ల నా
దైత్యారాతి తనూజుఁడేసె వనితన్ దర్పస్ఫురన్మూర్తియై.

ఉ. మోహనమంత్రితంబగు నమోఘసుమాశుగపంక్తి నావరా
రోహకుచంబు లక్షులును రొమ్మును కక్ష్యయుగంబు మారుఁడు
త్సాహము మీఱనేసి జయశంఖముబట్టెను రాజకీర సం
దోహపికాళి పెన్రొదలఁ దోయజలోచన కంపితాత్మయై.

కం. వడదాఁకిన వాడినలత
వడుపున వసివాళ్ళు వాడి వనజాననకై
వెడలిన బొమ్మవిధంబున
వడవడ వణకుచునుప్రాలె వసుధాస్థలిపై.

అయ్యవసరంబునఁ దత్సఖీబృందంబు లాసుందరీలలామ నెచటంగానక వగలంబొగులుచు నేతెంచి యొక్కసికతాస్థలంబున పద్మాంకుశ హలకులిశ కలశాది రేఖాలంకృతంబగు తదీయ చరణ యుగళ చిహ్నములనుగాంచి తన్మార్గంబునన్ జనుదెంచి మోహ పరవశంబునఁ జేష్టలుమఱచి నేలంబొరలుచున్న యక్కోమలినిం గనుంగొని సంభ్రమించుచు తద్దురవస్థలకు స్రుక్కుచు భయ క్రాంతాత్మలై దగ్గఱవచ్చి యయ్యింతికిట్లనిరి.

గీ. చెక్కు మీటిన పసవల్చు శిశువవకట!
యిట్టివలవంత బాల నీకెట్లు లొదవె?
మగువ నీమానధనమెల్ల దగిలికొనిన
చోరుడెవ్వాడు చెప్పవే సుందరాంగి.

గీ. అనుచు జెలులాడుమాటకు వనజగంధి
పరవశంబున విన దేవి భ్రాంతికతన
కాంతదురవస్థ కెంతయు వంతమిగుల
మగుడ సఖి జూచి పలికి రామగువలెల్ల.

సీ. అళులమాత్రకు నీవు తలకంగ నేటికే?
ప్రబలు నీ వేణికి బంటుబంట్లు;
చిలుకక రొదకింత చింతింప నేటికే?
కొమ్మ నీపలుకులు గొలుచుబంట్లు;
కైరవాపు నికింత కళవళం బేటికే?
నీమోము సిరులకు నెమ్మిబంట్లు;
రాజహంసలకింత రమణి కుందగ నేలె?
యెలమి నీ నడుపుల కేలుబంట్లు;

గీ. మగువ నీబంట్ల మాత్రకు బెగడనేల
యతనుఁ డేభాతి ధాత్రిపై నంగహీను
డేమి సేయంగఁగలఁడు నీ కేలభయము?
చింత నీకేల తెమ్మ నిశ్చింత వగుము.

గీ. అనుచు నీరీతి చెలులెల్ల నాదరమున
బుజ్జగించుచు వేడిన్ బుష్పగంధి

విరహసంతాప భారమున వివశయగుచు
నున్న చెలిఁజూచి సఖులెల్ల జిన్నవోయి.

గీ. వగల బొగులుచుఁ గౌగిళ్ళ వలను మిగుల
నెత్తుకొని తెచ్చి రప్పు డా యిందుముఖిని
విరహతాపభరమ్మున విహ్వలించు
కుసుమకోమలి నూరార్చి కూర్మిసఖులు.

ఇట్లు తెచ్చి యయ్యరవిందగంధి నొక్క మాకందంబుక్రింద ఇందోప్రపల వేదికామధ్యప్రదేశంబున మావిచిగురుటాకు లాస్తరణంబు గావించి ఫుల్లారవిందంబులేర్చి కేసరంబులూడ్చిపఱచి యామృదుల శయ్యాతలంబున నా చిగురుబోఁడిని శయనింపఁజేసి శైత్యోపచారంబులు సేయుందొడంగి; రందొక నిస్తులస్తనికపురంపు పలుకులు కర్ణపుటంబులం బారనూదె; ఒక గంధేభగమన ఘనసార నీహారవారిపూర మిళిత గళంబు నెమ్మెననిండ మెత్తె. వేఱొక జవ్వని కజ్జలమిళిత బాష్పధారామిళింపైన మృగమదోదార మకరికాపత్రి లసితకపోలఫలకంబులును నెమ్మొగంబును పన్నీట క్షాళనం బొనరించె. మఱియు నొక్క బింకంబు గుబ్బలాడి గబ్బి గుబ్బలమీఁద మౌక్తికహారశ్రేణిఁ బొందుపఱచె. ఒక మత్తకాశిని తత్తరంబున మెత్తని యడుగుల మెట్టి పన్నీరు నెమ్మెనఁ జిమ్మియు ఉసికవీజనంబుల విసరిన మున్ను రాజుచున్న విరహాగ్నిభగ్గున రవులుకొని లద్బంధుర గంధసారంబు మృగమదాలేపంబు నైవడి గనుపట్టె. మౌక్తికహారంబు లింద్రనీలహారశ్రేణి క్రేణిసేయ, ఫుల్లారవిందదళంబు లెండిన కారాకుల చందంబున పొడిపొడియై రాలిన నబ్బాల వెగ్గలంబై మరువాడి కగ్గంబై యుబ్బిబ్బొబ్బకవతి నిబ్బరంబైన వ్యలవంతల నుసనుసనుచుఁ బొరలుచున్న

కుసుమకోమలిని నిరీక్షించి యా చంచలేక్షణలు పంచశరు నుద్దే శించి కుసుమాంజలులు నివేదించి సాష్టాంగనమస్కారంబు లాచ రించి కరకమలంబులు ముకుళించి యిట్లని ప్రార్థించిరి.

ఉ. కిట్టడసేయు నీసమర కేళివిహారము రుద్రదేవతా
రాట్పురమేష్టి ముఖ్యసురరాజనికాయముమీద, నీవయో
యిట్టుల నేచ నేమిటికి నీలతకూనను మారనీధను
ష్షట్పద సింజనీప్రసవ సాయకపంక్తుల కింతు లోర్తురే?

సీ. నీ విక్రమస్ఫూర్తి నీలకంఠుని మేన
సగ మాడురూపంబు తగులఁజేసె
వనజసంభవునంతవాని వాగ్దేవికై
వావివర్తనములు వదలఁజేసె
గౌతమభార్యకై కడగి దేవేంద్రుని
కొక్కురోకో యని కూయఁ గోడిసేసె
ధర్మనిర్ణయ దుష్టకర్మశిక్షకు జముఁ
బేరిమిఁ జెల్లెలితోడఁ బెండ్లిసేసె

ఊర్ధ్వరేతస్కులగుచు మహోగ్రనిష్ఠఁ
బ్రబలు గాధేయశక్తిసంభవులఁ గలఁచెఁ
జెక్కుమీటిన పసవల్చు శిశువదెంత
బాలికను బ్రోవు కృపమీఱఁ బంచబాణ!

సీ. విప్రావనప్రౌఢి విలసిల్లు మీతండ్రి
విప్రయోగధ్వంసవృత్తి చనునె?
గురుతల్పకద్రోహి కుముదాప్తుఁడీచంద్రుఁ
డతనితోఁబొందు నీకర్హమగునె?

కాంచనస్తేయ దుష్కర్మకుండనిలుండు
నెగడు నాతని పొత్తు నీకుఁ దగునె?
నిత్యంబు మధుపాన నిరతులీ మధుపముల్
వీఁకవానిఁగూడ నీకుఁ దగునె!

గరిమఁ బలుగాకులును బెంచ బెరిమిమిగుల
పంచమస్ఫూర్తిఁ బరగెడి పరభృతముల
సంగడంబొప్పనే నీకు శంబరారి
చారుతరకీర్తి విహార జోహారు నీకు

కం. ఇందిరనందన నీకివె
వందనములు సేతుమయ్య వాత్సల్యత మా
సుందరిని బ్రోవు మిచ్చట
మందారయశోవిశాల మారనృపాలా!

అని ప్రార్థించుచు మ్రొక్కియు, వినుతించియు వేడుకొనిన వెలఁదికి చేరవైన సఖులు రాపట్టితోడ.

సీ. కనుచూపు సెగల నిన్గమరఁ జేసినయట్టి
భర్గుఁడే మాపాప పంచబాణ?
నెట్టణ నినుబట్టి కట్టలకుఁ గొట్టిన
శూరుఁడే మాకొమ్మ వారిజారి?
కోపించి మూఁగగా శాపమిచ్చిన రామ
విభుఁడటే మాలేమ పికములార?
నాలుకల్ గోయుచు లీలమై మిముఁ గ్రోలు
చిలువయే మాపోర మలయపవన?

పాంథకాంతల నేఁచిన పాపపుంజ
మెడిగి యీరీతి మిముఁబట్టి మెగడఁ జేయ

చేరెటుంగని కూన నీ చిగురుబోణి
నేఁచ ఫలమేమి మీ కబ్బె నీచులార!

కం. వలరాయుని హరిణాంకుని
మలయానిల కోకిలముల మానక తిట్టన్
కలకల కోలాహలములు
కలయఁగ నిండినను ధరణికాంతుఁడు వినుచున్.

కం. జననాథుఁడు విడఁగూడుక
జనుదెంచిన లజ్జ మిగులఁ జందాకినన గ్ర
క్కున తెరమాటుకుఁజన వ
వ్వన జేతుఁణవిధము వినియె వనితలచేతన్.

తద్వృత్తాంతంబాతయనువిని చింతాక్రాంతుండగుచు ముద్దుకూతుని బుజ్జగించి తోడ్కొని నిజమందిరంబునకుం జనియె నట్టి సమయంబున

గీ. దర్పకందర్ప మోహన ధ్వజశిఖాగ్ర
కలిత కాంచనమణిమయ కలశమనఁగ
తూర్పుదిక్కున నెంతయుఁ దోరమగుచు
విలసితస్ఫూర్తి గనుపట్టె వేగుచుక్క.

చ. యువతులపయ్యెదల్ దులచి యుబ్బుకుచంబులసోకి మోవులం
దవులుచు నూడు కాండములుతద్దయునట్టుకచాలముట్టి యు
త్సవమున సంచరించెఁ బటుసౌరభవిభ్రమలీలలొప్పి సు
ప్రవిమలపల్లవావళి విధంబుల నంత ప్రభాతవాయువుల్

ఉ. ఆరయ కాలభూవిభుని యార్ద్రితమించినవిద్య జూపె కా
సారమహేంద్రజాలపటుశక్రవినీల సుకందకావళుల్

ఘోరునవైచి పట్టుగరి ఫుల్లపయోరుహాసీమ భృంగముల్
వారకనిర్గమించెగసి వ్రాలినవైఖరులొప్పె నెంతయున్.

కం. మగువలు మేల్కొని విభులను
బిగికౌఁగిటఁజేర్చి తెరిపి బింబాధరముల్
సొగసుగ నొసఁగుచు గ్రోలుచు
మగరీతుల రతులఁ గలసిమలసిరి వేడ్కన్.

ఆ. వె. తెల్లనయ్యె నపుడు దీపంపు కళికలు
తమము విరిసి చనియెఁ దారలెల్ల
మాసి పశ్చిమాద్రి మరుగున కరిగెను
చంద్రుఁ డపరదిశకుఁ జనియె వేగ.

గీ. తామ్రచూడంబు లెంతయు దర్పమెసఁగ
దర్పకుఁడు సారెబట్టుచు ధర్మధార
కొమరుదీపింప కొక్కొ-రొక్కో యటంచు
కూసె కో డలికొమ్మల గుండెలదర.

కం. మందేహ జయ రమామణి
కందువ రవిరాకకలరి ఘనకుచయుగళిన్
బొందుగఁ బూసిన కుంకుమ
చందంబున సాంధ్యరాగ సంపదలొప్పెన్.

ఉ. అప్పుడు భానుమంతుఁ డుదయాచలశృంగమునీఁడ దీధితుల్
గప్పి మహాంధకార గజఖండన విక్రమసింహవైఖరుల్
చొప్పుమరంగ బుగ్నిచయసూక్తులు మించఁగ విప్రపుంగవుల్
తప్పక భక్తియుక్తులయి తద్దయు నర్ఘ్యములిచ్చి మ్రొక్కఁగన్.

అంతకుమున్న భద్రపాఠకులే తెంచి భూపాలాది గానంబు లొనర్ప వందిమాగధ స్తుతులును ప్రభాతతూర్యరవంబులు సెలంగ నాక ర్ణింపుచు కుంతల వసుంధరాధ్యక్షుండు మేల్కాంచి కాలోచిత కృత్యంబుల నిర్వర్తించి భూసురోత్తములకు చందనాక్షతతాంబూ లాదిపూర్వకంబుగా షోడశ మహాదానంబు లొనర్చి తాను స్రక్చందన చీనిచీనాంబర మణిఖచితాభరణాలంకృతుండై కొలువు కూటంబున కేతెంచి సింహాసనాసీనుండై మంత్రిజనంబుతో మం త్రాలోచనంబు చేసి తద్వచనానుకూలంబున స్వయంవరంబు చాటించిన

సీ. మాళవ నేపాళమత్స్య సమగధాంధ్ర
కొంకణటెంకణ కురువిదేహ
వంగాంగ సుకళింగబంగాళ మళయాళ
పాంచాల కేరళ బాహ్లీక
పానాట కర్ణాట బర్బరఘూర్జర
సింధుసౌవీరక చ్ఛేదియవన
గాంధారకోసల కాశ్మీరకాంభోజ
శూరసేన సుధేష్ణ హూణ్ణకుకురు
పాండ్యసౌరాష్ట్రచోళాది బహుళదేశ
విభులు తమతమ రథికాది వివిధసైన్య
పతులు గొలువంగ భూషణప్రభలు నిగుడ
వరుసవచ్చిరి కుంతలవరుని పురికి.

ఇట్లు చప్పన్న దేశాధీశ్వరు లేతెంచి రనంతరము.

సీ. పటుఘోటఖురపుటీస్ఫుటిత ధూళీపాళి
ఘుకధునీ శరధుల బురదసేయు

గంధసింధుర దానకర శీకరశ్రేణి
దండిమైనవి యట నిండ సేయ
రథనేమి ఘంటికా రంజితారావముల్
దిక్కుహరంబుల దీటుకొనఁగ
బహువీరభటసంఘ కహకహార్భటు లద్రి
ఘనగుహావళులెల్ల కలఁగఁజేయ

కేతనాగ్రస్థమణిమయశీతకలశ
ప్రభలు చండార్కరుచులతో ప్రతిఘటింప
మహితభూషణ దీధితుల్ రహిదనర్ప
వెలఁగి యేతెంచి నాపుణ్యశీల నృపుడు.

ధవళచ్ఛత్ర చామరంబులు మెఱయ వరాహధ్వజ ప్రభలు దిక్కులం బిక్కటిల్ల నేతెంచు నారాజశేఖరు నిరీక్షించి రాజు లెల్లను కుంతలాధ్యక్షు హర్యక్షమధ్యాలలామను వరియించు మనంబుల నిరాశులై రట్టి సమయంబున కుంతలాధ్యక్షుండగు వీరవర్మయు సభ్యభూపాలోత్తముల నెదుర్కొని సముచిత పూజా విశేషంబుల సంతోషితస్వాంతులం జేసి తోడ్కొని తెచ్చి సకల వస్తు పరిపూర్ణంబును విస్తార రమణీయంబులగు విడుబట్లను విడియించి పరమానంద కందళితహృదయారవిందుఁడై యారేయి గడపి మరునా డరుణోదయంబున పురోహిత పురస్సరంబుగా బ్రాహ్మణ సంఘంబుల రప్పించి వివిధమంగళతూర్యరవంబులు సెలంగ తన ముద్దుకూతురగు సుప్రభను మంగళస్నానపూర్వకంబుగా గంధమాల్యాంబర మణిమయాభరణాలంకృతంబుగా సఖీజనంబులచేతఁ జేయించి వేదోక్తమార్గంబున నభ్యుదికాది హోమకర్మ కలాపంబు సర్వంబును నిర్వర్తించి పురోహిత పుర

స్వరంబుగా సభార్యులగు బ్రాహ్మణోత్తములకును బంధుమిత్ర మంత్రిసామంతులకును షడ్రసోపేతంబుగా భక్ష్యభోజ్య లేహ్య చోష్య పానీయంబులాది భోజనంబులు గావించి సంతుష్టులైన వారికి స్వచ్ఛందన తాంబూలంబులొసంగి యారాత్రి యేతత్ప్రకారంబున విహరించిరని చెప్పి మఱియు నిట్లనియె.

చ. అరుణగభస్తిబింబము దయాచల శృంగమునందు మించె సొం
పరయసురేంద్ర సౌధ శిఖరాగ్రతలస్థితనవ్యకాంతి భా
స్వర కలశంబుభాతి విలసద్ఘన తేజము బిక్కటిల్ల సు
స్థిరతర హేమపీఠములు చిత్రముగా నృపుడుంచెబంచె వి
స్ఫురితతదగ్రపీఠముల భూభుజులుండిరి మోదితాత్ములై

రాజహంసవృత్తము:

మదనరూప నిర్జితైకమంజు సుందరాంగ మిం
పొదవుపుణ్యశీలు డప్పు డుగ్రభాను తేజముల్
పొదలనేగు దేరజూచి భూభుజుల్ మనంబులన్
సుదతి నివ్వరించు పెంపు సొంపుమాని రెంతయున్

కలహంసవృత్తము:

స్మరనిభాంగు పటుశాత్రవహనన
స్ఫురితశౌర్యు బలసూదన భోగున్
హరిపదాబ్జయుగళార్చిత భంగున్
పరహితార్థమిత బంధుర భాషున్

గీ. చూచి వెఱగంది నృపులెల్ల స్రుక్కిరపుడు
కాంచనాచల శృంగవికాసమాన

బాలభాస్కరుకైవడి ప్రభలునిగుడ
భద్రపీఠంబునం దొప్పెఁ బార్థివుండు.

అంత నక్కాంతలాధ్యక్షుండగు వీరవర్మయును తనకుమారీ రత్నంబగు సుప్రభావధూమణిని ధవళవసన స్రక్చందన చీనాంబర రత్నఖచిత భూషణాలంకృతం జేయించి చతురంతయానారూఢం జేయ ముక్తాజాలలంబసితచ్ఛత్రంబు పూబోణియొక్కతె పట్టె; చామీకరాభాంగు లిరువురు చామీకరదణ్డంబు మెల్లమెల్లనె విసరె; వేరె బాలాలలామంబు లాలవట్టంబులు ధరియించె; రొక్కలీలావతి కనకకాళాంజన వహియించె; నొక్కలలితాంగి కర్పూరమిళిత పూగఖండం బొసంగె; వేరొక్క వ్రీడావతి స్వర్ణ వర్ణపర్ణంబుల మడుపులొసంగె. ఇట్లు సఖీజన పరివృతయగుచు నక్కాంతాలలామ మన్మథమోహన మంత్రాధి దేవతయోయన*

30 పత్త్రము

... ... చెక్కుల తాండవింప నిం
పులుడలుకొత్త భూవిభునిముందరనిల్చెను మోహనాకృతిన్.

కం. అప్పుడు భూపతిపీఠము
గుప్పున దిగనురికి కుసుమకోమలిని వడిన్
జొప్పమర రథముపై నిడెఁ
జిప్పిలుమోహంబుతోడఁ జిత్తంబలరన్

అపుడు యుగంధరాది ప్రధానవర్గంబును శత్రుంజయ ప్రముఖ దండ నాయకులును, తమతమ బిరుదధ్వజచ్ఛత్ర చామరాది చిహ్నం బులు మెఱయ రథకరిహయ వీరభట సంకలిత సంకుల సైన్యంబు

* గ్రంథపాతము (౨౯, ౩౧ పత్త్రములు) రెండు పత్త్రములు పోయినవి.

పరివేష్టింప వరాహధ్వజప్రభలు నభంబున కాభరణంబులనింప విమలచ్ఛత్రంబు పూర్ణసుధాకర బింబంబనుకరింప చామరంబులు విలసిల్ల రోదసీకుహరంబు పిక్కటిల్ల వీరశంఖంబు పూరించుచు భేరీభాంకారంబు లంభోరాశి రవంబులం దిరస్కరింప రత్నఖచిత సువర్ణస్యందన దీప్తులు దేజరిల్ల నక్కాంతారత్నంబుతో నిజరాజధానియగు మాయాపుర మార్గంబుబట్టి చనుచుండె నట్టిసమయంబున సమస్తదేశాధీశ్వరులును నక్కాంతామణి యతని వరించుటకు చూపోపంజాలక సమస్తబలంబుల నాయత్తంబుచేసికొని యుద్ధసన్నద్ధులై గంధసింధురయూధంబులు భైరవారావ భీకర కంఠీరవంబునుం బొదువుచందంబున చనుదెంచి రట్టిసమయంబున.

శా. గంధేభేంద్ర రథాశ్వవీరభట సంక్రాంతార్భటుల్ నిండె, ది
క్స్కంధుల్లీల వసుంధరావలయ మాశాచక్ర మల్లాడె, గ
ర్వాంధోదంచిత భేరిభాంకృతులు దుర్వారోద్ధతిన్మ్రోగె దో
స్స్కంధానస్ఫుట సాయకావళులు విస్ఫారోద్ధతిన్రేగెగా.

అవ్వీరులు పోకుపోకుండని మొలుంగులు నింగిముట్ట పెల్లార్చిన తత్కోలాహలంబు లాకర్ణించి యుగంధరాది ప్రధానవర్గంబును శత్రుంజయాది దండనాయకులును, నిలువంబడి కోదండ టంకారంబులును రథనేమి నిస్స్వనంబులును, గజబృంహితంబులును వీరభట కహకహార్భటులును, హయఘోషారవంబులును, నానావిధ తూర్యనినదంబులును, ప్రళయకాలభైరవ ఘుమఘుమధ్వానంబు ధిక్కరింప భూనభోంతరాళంబు భేదిల్ల సింహనినాదంబుసెలంగ శత్రుంజయుం డుద్ధతుండగుచు నిలచె నయ్యవసరంబున.

మ. ఘననారాచపరంపరోగ్ర నిహతిన్ గంధేభయూధంబు కాం
చనభూపైక హయాళి వీరభటులన్ ఛత్రధ్వజాభీలయో

ధనికాయంబుల మస్తకవ్రతతులన్ దర్పంబుశోభిల్లఁగా
తునిమెం ద్రుంచెను గూర్చెఁ జించెనపుడున్ దోర్గర్వదుర్వారుఁడై

గీ. తనదు శత్రుంజయాఖ్య తథ్యంబెగాఁగ
వీరశాత్రవయోధుల వివిధగతుల
మారి మసరినచందాన బారి సమరె
తత్పరాక్రమ మీక్షించి ధరణిపతులు.

మ. పటురౌద్రాకృతులొప్పఁదాఁకి కడిమిన్ భల్లంబులొక్కుమ్మడిన్
చటులోదంచిత విక్రమస్ఫురణలన్ సాంద్రంబుగాఁగప్పి వి
క్కుటమౌ క్రోధరసంబు వెల్లివిరియన్ తుద్దండటంకార వి
స్ఫుటరావంబులు నింగిముట్ట నతఁడాస్ఫోటించి పెల్లేసినన్.

కం. కూలెను హయసందోహము
కాలబలంబెల్ల మడిసె గంధగజంబుల్
శైలంబులు రెక్కలు దెగి
వ్రాలనగతి వ్రాలె, మడిసె రథికశ్రేణుల్.

కం. పాఱిన బలములు వెనుకొని
కాఱడవి దహించు ఘోరకాలాగ్నిగతిన్
దారుణభంగి వధించెను
వీరాగ్రేసరుఁడు శత్రువీరులనెల్లన్.

ఇట్లు తదీయ శరపరంపర నిహన్యమానులై కనుకనింబరచినం జూచి దొరలును సకలదేశాధీశ్వరులును రోషణభీషణాకారులై కరతలం బెత్తి నిలువు నిలువుండని పేరుపేరునం బిలుచుచు నదలించుచు పురికొల్పినను పోరికి సమకూరకున్న నుదగ్రవిక్రమోదగ్రులగుచు

కోదండ టంకారంబులు సెలంగ సాంద్ర శరజాలంబులు వరగించుచు పైఁబడినఁ జూచి యా శూరోత్తముండును రౌద్రరసావేశంబున

చ. కనుగవకెంపు దట్టముగఁ గార్ముకము న్తశిరీముఖాంబు లే
పున నిగుడించి చాపమును భోరున ద్రుంచియు రథ్యసూతులన్
దునిమి సిడంబులన్నరికి దుస్సహ విక్రమలీల బాహులుం
గనియలుసేసి మస్తకనికాయము లొక్కటఁ ద్రుంచి యార్చినన్.

ఆ పుణ్యశీల నృపాలబాణజాలంబుల కోహటించి పలాయమానులైన భూపాలురెల్ల కాకులగుట వీక్షించి కరుణాయత్తచిత్తుండగుచు ధర్మధారలుం బట్టించి వీరశంఖారవంబు భూనభోంతరాళంబు నిండపూరింపుచు విజయరమాకమణీయనందను సుప్రభాస మేతుండగుచు నిజరాజ్యాభిముఖుండై చనుచుండె నంత కుంతలధరాకాంతుండును వివిధరత్నాభరణంబులును చందనాగరు కర్పూర సంకుమద కుంకుమా హరిద్రాశంబులాది పరిమళద్రవ్యంబులును గోధేను శతసహస్రంబులును, జవనాశ్వశతసహస్రంబులును, మత్తమాతంగయూథంబులును, సూతాశ్వపతాకాభి శోభితంబులగు కాంచనరథసహస్రంబులును, దాసదాసీజనంబులును, కూతునకు జామాతకు నరణంబు పరిచారికాజనంబులఁ దోడుపంపినం గైకొని మంగళతూర్య రవంబులు సెలంగ నిజరాజధాని యగు మాయాపురంబునకుంజని సకల పతాకాలంకృతంబై వాసరసంశృక విధంబున విలసిల్లు తత్పట్టణరాజంబు జ్యోతిర్విద్దత్త శుభలగ్నంబునఁ బ్రవేశించుసమయంబున

చ. చిఱునగవొప్ప నేత్రరుచి చెన్నుగఁ గాంతువిలాసదీధితుల్
వెలయఁగఁ జూచి కాంతులును క్రేళ్లురకంబురి కామినీమణుల్

గరిమను మంగళార్తులొడికంబగు బంగరుపాలికావళుల్
వరుసను దెచ్చి భూపతికి పంకజగంధికి నిచ్చి రప్పుడున్.

ఇట్లు పురప్రవేశంబుసేసి రాజవరులు కూర్చున్నసమయంబున తత్పౌర విలాసినీరత్నంబులు తదుత్సవాలోకనాకుతూహలాయత్తచిత్తలై సేసలు చల్లుచుండ నవ్వధూవరులు నిజమందిరంబు ప్రవేశించిరి. అట కక్ష్యాంతరంబులు గడచి యేనుగు మొగసాల ప్రాంగణ హర్మ్యంబులు సెలంగ సుప్రభా సమేతంబుగా నా మనుజాధిపుడు రథావరోహణంబొనర్చి యయ్యిందుముఖి నభ్యంతరావాసంబు నకు వీడ్కొల్పి తాను మంత్రిసామంతులు వీరయోధసంఘంబులు పరివేష్టింప సింహాసనాసీనుండై పేరోలగంబున నుత్తమనీచ తారతమ్యంబుగా తాంబూలపురస్సరంబుగా చీనిచీనాంబరాభరణాదు లొసంగి సాదరంబున వీడ్కొల్పిన సమస్తజనంబులు తమ తమ వాసంబులకు జనిరనంతరంబ యారాజశేఖరుండు నభ్యంతరమందిరంబునకరిగి యారాత్రి సుఖవిహారంబులం బ్రవర్తిల్లె. అంత ప్రభాతంబగుటయు కాలోచితకరణీయంబులు నిర్వర్తించి జ్యోతిషికదత్తశుభలగ్నంబున సుప్రభం బరిణయంబై తదీయ సంభోగ సరసాలాప చతురద్యూతాది వినోదంబుల ననయాస్తమానంబులును దత్పరాయణుండై ప్రవర్తిల్లుచున్న కతిపయవర్షంబులు సనియె, నంత పద్మగంధి గర్భంబువహియించెనని చెప్పి యయ్యాశోధనునకు నత్తపోధనుం డిట్లనియె.

కం. నెలమసలె చిరం జిక్కెను
తలయేరొక్కింతపుట్టెఁ దనువును మొకమున్
వెలవెలనయ్యెను బయికలు
నలసత ఘనమయ్యె నన్నమరుచయ్యెఁ గడున్.

కం. వట్టముగ నోకిలింతలు
చిట్టము లధికంబులయ్యెఁ జెలువకు మిగులన్
నట్టణకోర్కులు తరుచై
నెట్టుకొనెన్ రోమరాజి నెఱిగనుపట్టెన్.

గీ. అంగజునిచేతి బంగారు బొంగరముల
చెలువుమిగిలిన నీలంపుములుకులట్లు
గబ్బిగుబ్బలు గొప్పలై నిబ్బరముగ
నాతి చనుదోయి ముక్కులు నల్లనయ్యె.

ఆ. వె. దోరచింతపండు సారె నించుక దిను
వంటకంబుదింట కంటగించు
చెలులు వేడుకొనిన వలసి నల్లక యెట్లొ
యోగిరం బొకింత యువిద గుడుచు.

అంత దినదిన ప్రవర్ధమాన గర్భభారాక్రాంతయగుచు నబ్బాలా
లలామంబు.

సీ. వల్లభప్రార్థన వదలు కౌఁగిటఁజేర్చు
నుదుట గుబ్బలుబట్ట నొదుగలేచు
మోవిపైఁ గెంపులు మొలపింపఁ గోపించు
నలసత నుసురుస్సురనుచుఁ బొరలు
హారంబులొసఁగిన భారఁబులనుచును
పదిలంబుసేయును ధరణిబెట్టు
నీకోర్కెలెఱిగింపు నిక్కంబు నాకన
సిగ్గునఁ జెప్పదు చెలువునకును
సర్వసర్వంసహాబార సమానవహన
దక్షుఁడైనట్టి తనయుండు తనదుగర్భ

వివరమునఁ బూటపూటకు వృద్ధిపొంద
గర్భభరమున మెరసె నక్కాంబుకంఠి. ౨౬౨

కం. నెల లిటు లేడెనిమిది జనఁ
బోలుపొందుచు సతికి మిగులఁ బ్రొద్దుల నెల నిం
పలరఁగ బ్రొద్దులు నిండిన
విలసిల్లెను గంజనయన విమలప్రభలన్. ౨౬౩

కం. పంచగ్రహములు వరుసను
సంచితముగ నుచ్చగతుల సంపూర్ణదయో
దంచిత దృష్టిఁగనుంగొన
మంచి సులగ్నమున సుతుని మానిని గనియెన్. ౨౬౪

తదవసరంబున ౨౬౫

గీ. వనితయొక్కతె యేతెంచి మనుజపతికిఁ
దనయుఁడుదయించెనని చెప్పఁ దరుణికపుడు
విమలమణి భూషణాంబర వితతులొసఁగి
పుత్త్రవదనావలోకన స్ఫురణఁ జెలఁగి. ౨౬౬

గీ. మంగళస్నాన మొనరించి మనుజవిభుఁడు
కట్టుపుట్టము లొసగెను గారవమున
తన పురోహితవరునకు ధర్మసరణి
ప్రియము దళుకొత్త విప్రులఁ బిలువఁబంచె. ౨౬౭

సీ. వలనొప్పు పండితవరులఁ గవీంద్రుల
వందిమాగధ వారవనజముఖుల
కతులభూషాంబర వ్రతతులొసంగియు
మంగళతూర్య సమగ్ర విభవ
మలర పుత్త్రోత్సవ మవనీశ్వరుఁడు మహా
సంభ్రమంబునఁజేసె సకలజనులు

సంతోషచిత్తులై సంస్తుతుల్ సేయుంగ
బ్రాహ్మణాశీర్వాద పటిమ సెలంగ
గీ. వందిమాగధసన్నుతుల్ వారసతుల
నృత్యగీతంబు లెంతయు నివ్వటిల్ల
లీల గగనోక్తి వీరగంబాళ నామ
కరణ మొనరించె సుతునకు గారవమున. ౨౬౮

అప్పట్టున నశరీరవాణి యిట్లనియె. ౨౬౯

శా. సప్తద్వీపపరీతభూమి స్వభుజాస్కంధాగ్రభాగమ్మునన్
వ్యాప్తిం దాల్చి సమస్తరాజమకుటోద్యద్రత్న సంఘట్టిత
ప్రాప్తోదారపదాబ్జుండై వెలయుచున్ బాధోధికన్యాధిపున్
సప్తాశ్వాయుతకోటితేజుం గరుణాసాంద్రున్ యశశ్చంద్రువిన్.

క. శ్రీరమణీ భూవనితా
శ్రీరంజితు శేషగరుడ చిరభృత్యగణో
దారుం బ్రతిష్ఠసేయును
దారుల సత్కీర్తి పుణ్యసంపద లమరన్. ౨౭౦

అని యాదేశించె నయ్యవసరంబున బృందారకు లమందానందంబున మందారదివ్యపుష్పంబులు వర్షించిరి. సురదుందుభులు మ్రోగె, గంధర్వ గంధేభగమనా విలాసగానంబు లతిశయిల్లె, కిన్నరయక్షకాప్సరోంగనాజనంబుల లాస్యసంరంభంబులు రంజిల్లె. ఇట్టి మహోత్సవంబుల నానందించి మంత్రి సామంత ప్రముఖ పరిజనసంఘంబుతో నప్పుణ్యశీలనృపాలుండు సంతుష్టాంతరంగుండై పుత్రలాలన పరాయణుండై సుఖంబున ప్రవర్తిల్లుచుండెనని శౌనకాది మహామునీశ్వరులకు సూతుం డెఱింగించిన ట్లుత్తపోధనధుర్యుం డా భూపాలవర్యున కెఱింగించె ననుటయు ౨౭౧

ఉ. శ్రీవనితాకుచాచల విశేషవిహారమయూరవర్య స
త్పావన వాహినీజనక పాదసరోరుహమాధుర్య రుక్మిణీ
శ్రీవిలసన్మనోంబురుహ సిద్ధమధువ్రత భక్తసంఘ సం
భావిత భద్రమూర్తి పటుబంధురమేఘనిభాంగ కేశవా! ౧౨౩

కం. రంగత్పయోధికన్యా
తుంగస్తన గంధలిప్త దోర్మధ్యల స
ద్గాంగేయ రత్నభూషణ
గంగాపురశరణ దివిజ గణనుత చరణా! ౧౨౪

మాలిని. సరసిజదళనేత్రా! సత్యభామాకళత్రా!
కరతలధృతచక్రా! ఖాండితోదగ్రనక్రా!
సరసగుణనికాయా! సచ్చిదానందకాయా!
గిరిశయనుతపాదా! కేశవానందమోదా! ౧౨౫

గద్య

ఇది శ్రీహరి గురుపాదపంకేరుహధ్యానానందచరిత్ర సరస సంగీత
సాహిత్య కవిత్వరచనావిచిత్ర తిరుమంత్రద్వయ నిత్యాను
సంధాన కౌశలహృదయసౌందర్యగోత్ర ప్రోల్యాలగోత్ర
పవిత్ర కోనమదేవికళత్ర మోటవాడవంశవారాశి
జనితకైరవమిత్ర బుధబంధుసుకవిజనస్తోత్ర రెడ్డిడ్డి
పర్వతరెడ్డిపౌత్రి రంగారెడ్డిపుత్రి మల్లారెడ్డి
దేశాయి ప్రణీతంబైన గంగాపురమాహా
త్మ్యంబను మహాప్రబంధము నందు
ద్వితీయాశ్వాసము.
శ్రీకృష్ణార్పణమస్తు



శ్రీ కేశవస్వామినే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# గంగాపుర మాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

శ్రీమద్గంగాపురమణి
హేమాంచితసౌధవాస! యిందిరరమణా!
శ్రీమహితయూవకోర
స్సీమోజ్జ్వల చెన్నరాయశ్రీశ (జనగేయా!) ౨౭౬

దేవ! వినవవధరింపు మాతరువాతి కథావృత్తాంతం బెట్లయ్యె నానతిమ్మనిన శౌనకాది మహామునీశ్వరులకు సకలపురాణేతిహాస కథాకథనశేముషీ సమేతుండగు సూతుం డిట్లనియె. అట్లు లబ్ధసంతానుండైన యా మహీపాలుం డెట్లు ప్రవర్తించె నానతిండనిన ధర్మనందనునకు నారదుం డిట్లనియె. ౨౭౭

చ. తనయుని ముద్దుమాటలును తత్కృత బాల్యవిలాస చేష్టలుఁ
గనుగవ చల్లఁగాఁగ నధిక ప్రమదంబునఁ జూచి పొంగుచున్
వనరుహనేత్రితోఁ దగిలి వారకపుత్త్రిని తోడిలోకమై
పనుపగు రాజ్యభారపరిపాలన మాత్మదలంప కెంతయున్. ౨౭౮

కం. సుతలావ తత్పరులై
చతురత సుప్రభయు దాను సంతస మెసఁగన్

సతతము విహరింపఁగ న
య్యతివకు గర్భంబు నిల్చె నతిరమ్యంబై.

కం. తొమ్మిదిమాసమ్ములు సనఁ
గ్రమ్మర శుభలగ్నమునను గాంతామణి తా
నెమ్మిఁ గుమారునిఁ గనియెను
సమ్మతిఁ బుత్రోత్సవంబు జనపతి సేసెన్.

గీ. అంత నశరీరవాణి దానకుమారు
మహితగుణశీలు భువనైక మల్లుఁడనఁగ
నామకరణంబుచేయ నానందమెసఁగ
సిరులుదళు కొత్తరాజ్యంబుసేయుచుండె. అంత

ఇవ్విధంబున ప్రతివర్షంబును క్రమక్రమంబున జగదేకమల్లు త్రిభువనైకమల్లు చాణుక్యమల్లులను నామంబుల వెలయు కుమారులం గని సంతోషంబున పుత్రలాలన పరాయణుండై పాళిజ్యంబగు రాజ్యంబు పరిపాలనంబు సేయుచుండె. తత్కాలంబున ధర్మప్రకాశుండను రాజు తీర్థయాత్రాపరుండగుచు గంగా మహానదీ ప్రముఖ పుణ్యతీర్థావగాహనంబు లాచరించియు, బ్రాహ్మణ సహస్రంబులకు సవత్సగోధేను సహస్రంబులును, కాంచననిష్క సహస్రంబులును, కరిహయ మణిమయాభరణ చీనిచీనాంబరంబులును స్రక్చందనాంబర రత్నఖచితాలంకృతులగు కన్యాసహస్రంబులును, దానంబులు సేసి షడ్రసోపేతంబులగు భక్ష్యభోజ్యలేహ్యపానీయ ప్రముఖాన్నదాన విశేషంబులఁ దృప్తులంజేయుచు శ్రీరమామణీశ్వర దివ్యమంగళవిగ్రహ నిలయంబులగు పాండురంగా హోబల వేంకటాచల కాంచి శ్రీరంగ శ్రీకూర్మ శ్రీపురుషోత్తమాదిక్షేత్రంబుల పూర్వోక్తప్రకారంబులసకలదానపుఁస్న

రంబుగా మృష్టాన్నపానాదుల భూసురోత్తముల సంతుష్టులం జేయుచు మఱియు శివస్థానంబులగు కాంచీ కుంభకోణారుణాచల చిదంబర వారణాసీ ప్రముఖక్షేత్రంబుల నేతత్ప్రకారంబుల సర సాన్నదానంబు లొనర్చుచు తద్దేవతా సందర్శనంబుసేయుచు వందన సహస్రపూర్వకంబుగా సుత్కృష్టపూజ లొనరించుచు మాయాపురంబున కేతెంచెనని చెప్పి వెండియు నిట్లనియె. ౨౮౨

గీ. దేవసేనా మహీనది తీర్థమాడి
ధరణి బృందారకుల కర్థిదాన మొసఁగి
సరస శ్రీవేదశృంగాఖ్య గిరితటమున
భర్గసీమంతినీమణి దుర్గఁగాంచి. ౨౮౩

వందన సహస్రపూర్వకంబుగా పూజలొనర్చి పంచలింగ తీర్థంబున సుస్నాతుండై వటుకభైరవ కరివదన మాతృకాగణ సమేతుండగు నమ్మహాదేవుని భక్తిపూర్వకంబుగా నర్చించి యందు ధరణి బృందారకబృందమ్ములకనేక దానంబు లొసంగియు భోజనంబు లిడి స్రక్చందనతాంబూలంబు లొసంగి సుఖోపవిష్టులై యున్న సమయంబున బ్రాహ్మణోత్తములంగాంచి యీ దేవసేనా నదీ ప్రవాహంబున నేతన్మధ్యప్రదేశంబునకు ఇట మీనాంబరంబను నభి ధానంబెట్లయ్యె నెఱింగింపుఁడని వినయంబునఁ బ్రార్థించిన నప్పార్థివోత్తమునకు బ్రాహ్మణోత్తము లిట్లనిరి.

కం. మును దేవసేనుఁడనియెడి
మనుజేంద్రుం డిప్పురంబు మానితసంప
ద్ఘన విక్రమ విభవంబుల
ననయతఁ బాలించె విబుధసంఘము బొగడన్. ౨౮౪

గీ. దేవసేనాఖ్యుఁడైన పృథ్వీవరుండు
దేవతటి నీలలామను దెత్తు ధరకు
ననుచు హిమవంతమున కేగి యతులనిష్ఠ
ఘోరతప మాచరించెను కువలయేశ. ౨౮౮

గీ. ఆతఁడటుసేయు తపమున కాత్మనలరి
గంగ ప్రత్యక్షమైనిల్చి క్ష్మాధినాథ!
వరమొసంగెద వేడుమా! వాంఛితార్థ
మనుడు సాష్టాంగమెరిగి యమ్మనుజ విభుఁడు. ౨౮౯

చ. మునుపు భగీరథాఖ్యనృప ముఖ్యుని వెంబడినేఁగుదెంచి స
న్మని కపిలోగ్రకోపశిఖముట్టిన యాసగరాత్మజాత స
ద్ఘనతర భస్మరాసు లధికంబగు నీసలిలాభిషేక సే
చనమునఁ బుణ్యలోక పటుసౌఖ్య మొసంగిన తల్లి మ్రొక్కెదన్.

చ. సనయుత శంభుమౌళి విలసన్మతి వర్ధిలి భీష్మఁగన్న యో
జనని! మదీయ దేశమునఁ జయ్యనఁ బావనలీలఁబర్వి పెం
పొనర మదీయనామము సముజ్జ్వలపుణ్యవిలాస సంపదల్
తనరఁగఁ జేయుమమ్మ! విదితంబుగ మత్పురిసన్నిధిన్ వడిన్.

గీ. అనుచు ప్రార్థింప నప్పు డయ్యమరతటిని
దేవసేనాఖ్య యీ యాంధ్రదేశమునను
పుణ్యవాహిని యగుచును బొలుపు మిగుల
భుక్తిముక్తిప్రదంబునై పూర్ణమగుచు. ౨౯౦

ప్రవహింతునని చెప్పి యాచొప్పునఁ బ్రవర్తించెనని చెప్పి విప్రులు
జేనితో మఱియు నిట్లనిరి. ౨౯౧

కం. ఏత త్తీర్థవిశేష
ఖ్యాతులు నీ కెఱుకఁయయ్యె నార్యస్తుత! సం
ప్రీతిని మీనాంబర సం
జాతక్రమమెల్ల వినుము జనవరతిలకా! ౨౯౩

చ. నలుఁడను చక్రవర్తి సురనాయకభోగసమగ్రవర్తి ని
ర్మలతరకీర్తి సప్తజలరాశిపరీవృతధాత్రి నంతయున్
ఎలమిడలిర్ప నేలె వసుధేశ్వరులెల్ల భజింప విక్రమో
జ్జ్వలుఁడగు నానృపోత్తముని వారక యా కలి వేధ సేయుచున్.

గీ. అతనిఁ బుష్కరుతో జూదమాడఁ జేసి
యతని సామ్రాజ్యమంతయు నపహరింప
తోయజేక్షణ దమయంతితోడ నతడు
ఘోరవిపినంబులకు నేఁగెఁ గుతలపడుచు. ౨౯౪

ఇట్లుగా నలుఁడు విపినాంతరంబులఁ గ్రుమ్మరుచు కాంతాసమేతుండై దైవయోగంబున నేతత్క్షేత్రంబున కేతెంచి దేవసేవానదీకృతస్నానుండై క్షుత్పీడితుం డగుచు నందలి మీనంబులం బట్టుకొని పచనంబుఁ జేయుమని దమయంతిచేతి కిచ్చిన నయ్యింతి పాకంబు సేయుచున్న యవసరంబున ౨౯౫

గీ. పడను జూడంగ నొకకట్టెఁ బద్మగంధి
కలియఁబెట్టిన నవి జీవకలితమగుచు
మడుగులోదూఁకె; వెఱగంది మగువ చూడ
నపుడు మీనాంబరాఖ్యమై హ్రదము మెఱసె. ౨౯౬

కం. అందలి వనముల తగు మా
కందఫలావళులు గోసి కాంతయుఁ దానున్

డెందములలరఁగఁదిని రిం
పొందుచు జలములను వార్చిరుత్సాహమునన్. ౨౭౭

కం. అంతట నిషధాధిపుఁడా
కాంతను వంచించిచనియెఁ గంజాక్షికడున్
వంతలపాలయి మనమునఁ
జింతించుచుఁ బుట్టినిల్లుసేరెను కడకున్. ౨౭౮

అంతట నలుండును కర్కోటకాదేశంబున నయోధ్యాపురంబునకుం జని ఋతుపర్ణునిం గొల్చుచుండె. పిమ్మట నాతఁడు దమయంతీ చోదిత బ్రాహ్మణప్రేరితుండగుచు ఋతుపర్ణుని రథచోదితుండై విదర్భనగరంబునకు వచ్చుచు మీనాంబరంబుసేరం జనుదెంచి ఋతుపర్ణసమేతుం డగుచు తజ్జలంబులఁ గ్రుంకి తత్క్షణము కలికలిత కలుషంబువలన నిర్ముక్తుండగుచు నిర్మలాంతః కరణంబునఁ గుండిన పురంబుఁకుంజని కర్కోటక దత్తోత్తరీయంబు సంస్మరణ మాత్రంబున సన్నిహితంబగుటయు నదిగప్పుకొనిన మాత్రన; ౨౭౯

సీ. ఆజానుదీర్ఘబాహార్గళ యుగళంబు
విపులవక్షంబును విమలకమల
చారునేత్ర ద్వయోదారస్మితాస్యంబు
బాలార్కసత్ప్రభాభాసురంబు
కంకణకేయూర కటిసూత్రకుండల
రత్నకిరీట విభ్రాజితంబు
తారకావళిగేరు తారహారశ్రేణి
లలిమణీముద్రికావిలసనంబు

మృదులచిత్రదుకూల సమ్మేళనంబు
చందనాగరు కర్పూర చర్చితంబు
నైన సన్మూర్తిగాఁ గ్రాలె నద్భుతముగ
సరససత్కీర్తి యానలచక్రవర్తి. ౩౦౦

గీ. అతుల నజ్ఞాతవాస ప్రయాసవర్ష
వితతి గడిపిన యాత్మీయవిభునిఁ జూచి
పరమసాధ్వీశిరోమణి భాగ్యనిలయ
హర్షమిఁగురెత్త దమయంతి యలరెనపుడు. ౩౦౧

కం. అని మీనాంబర ప్రాద సం
జనిత కథాకలనఁ జెప్పి జననాథునితో
వినుము పురాతనకథ యొక
టనఘాత్ముఁడు పుణ్యచరితుఁడను నృపవరుఁడున్. ౩౦౨

కం. ఏకచ్ఛత్రముగాఁగను
గైకొని ప్రాగ్దేశమేలె ఘనుఁ డతిశౌర్య
ప్రాకట బాహుబలాఢ్యుఁడు
పాకారి సమానభోగ భాగ్యోజ్జ్వలుఁడై. ౩౦౩

కం. తన పూర్వకర్మవశమున
జనపతికిని దుష్టరోగ సంభవమైనన్
ఘనధర్మ విపాకాదుల
విను ప్రాయశ్చిత్తవిధుల వెలయఁగఁ జేసెన్. ౩౦౪

విప్రవర్యులకు దధిక్షీర పాయసాపూపకందమూల వివిధశలాటుప్రముఖ
శాకంబులును చోష్యలేహ్యపానీయంబులతోడ విమలాన్నదా

నంబు లవారిగాఁజేసి తదవశేషాన్నపానాదుల భార్యాసహితుండై భుజియించి స్రక్చందనాది తాంబూలంబు లొసంగి తానును తాంబూలాదులం గైకొనియె నవ్విధంబునఁ గతిపయదినంబు లచ్చోట వసించి కృతార్థుండై నిజదేశంబునకుం జనియెనని ధర్మప్రకాశున కెరింగించిన నతండును సంతోషితస్వాంతుండై నిజదేశంబున కరిగె. తద్వృత్తాంతంబు పుణ్యశీలవసుంధరాధ్యక్షుం డాకర్ణించి మీనాంబరంబునకుం జనుదెంచి విద్వద్గోష్ఠిఁ బ్రవర్తిల్లుచున్న సమయంబున నొక్క బ్రాహ్మణోత్తముండా భూపాలోత్తమున కిట్లనియె. 3౧౫

చ. జలనిధికన్యకామణియు సాగరకాంచిలతావధూటియున్
జిలిబిలి ముద్దుమాటలను జొగట ముచ్చటలాడఁ బద్మజా
దులు వినుతింపఁగా విమలతోయజపత్త్రవిశాలలోచనుం
డలరుచునుండు నిప్పురిని హర్మ్యతలంబునఁ గేశవాకృతిన్. 3౧౬

మత్తకోకిల. తొల్లి మంగళవిగ్రహంబున ధూర్జటిప్రియుఁ డిందిరా
వల్లభుండు ముకుందుఁ డీశ్వరు వైభవంబున నిందు రం
జిల్లఁ గేశవమూర్తియుండును చిత్రహర్మ్యమునందు సం
ధిల్లు భుక్తియు ముక్తులిచ్చుచు దివ్యభోగసమగ్రుఁడై.

అని సుశర్మాభిధానుండగు విప్రపుంగవుం డెఱింగించిన అభ్భూపాలవర్యుండును లక్ష్మీశ్వరముఖు నయ్యాదికేశవునిందెచ్చి పునఃప్రతిష్ఠఁ జేతునని మహోత్సవంబున మీనాంబరంబునఁ గృతస్నానుండై నిత్యకర్మానుష్ఠానంబులు నిర్వర్తించి విప్రజనంబులకు షోడశ మహాదానంబులొసంగి శుచిర్భూతుండగుచు దర్భశయనంబున శయనించిన నరుణోదయ సమయంబున 3౧౭

సీ. నీలాభ్రనిభగాత్రు నిర్మలచారిత్రుఁ
గమలాకళత్రు సత్కంజనేత్రు
మకరకుండల కర్ణుఁ బ్రకట ప్రభాపూర్ణుఁ
దతపీతకౌశేయు నతవిధేయుఁ
గమనీయసౌందర్యుఁ గాంచ నాచలధైర్యు
మణిమయోజ్జ్వలభూషు మంజుభాషు
వైజయంతికధాము వందితసుత్రాము
నభ్రకేశధ్వజు నమితతేజు
యోగిహృత్పద్మ భృంగేంద్రు భోగసాంద్రు
మహిత సత్యామనోల్లాసు మందహాసుఁ
జంద్రబింబాస్యుఁ గేశవు జలధిశయను
స్వప్నమునఁ గాంచె నప్పుడా జనవిభుండు. ౩౦౯

కం. వరమీన కమఠకిటినర
హరివామన రామరామహలధరబుద్ధ
స్థిరకల్కిరూపలీలా
ధరణీభరహరణకేళి దనరుదువీశా! ౩౧౦

ఉ. కేశవ! వాసుదేవ! వరకేసరి! మాధవ! శౌరి! శ్రీహృషీ
కేశ! ముకుంద! చక్రధర! కృష్ణ! మురాంతక! నందనందనా!
శ్రీశ! దయాసముద్ర! సరసీరుహపత్త్రవిశాలనేత్ర! వి
శ్వేశ! జగన్నివాస! యరవిందభవార్చిత! రుక్మిణీధవా! ౩౧౧

ఉ. పాహి రమాధినాథ! భవబంధవిమోచన! విశ్వరూప! మాం
పాహి సురేంద్రవంద్య! మురభంజన! కేశవ! రుక్మిణీశ! మాం
పాహి జగన్నివాస! నవబంధురమేఘ సముజ్జ్వలాంగ! మాం
పాహి యశోవిశాల! వర పద్మదళాయతచారులోచనా! ౩౧౨

అని భక్తిపరవశుండును వినయవినమితోత్తమాంగుఁడు నగుచు స్తోత్రంబుసేయు నబ్భూపాలోత్తముని శ్రీరమాజాని కృపావిశాల విలోకనామృతధారాభిషిక్తుం జేయుచు డాయుంబిల్చి భక్తజనాభయప్రశస్తంబగు హస్తంబున నెమ్మేను నిమురుచు మేఘగంభీర స్వరమున ఓయీ! నీభక్తి కెంతయు సంతసించితిని. గండకాద్రి సమీపమున వెలయు నామూర్తినిఁ దెచ్చి యాలయ గోపురంబులు విసర్జించి యందుఁ బ్రతిష్ఠింపుము. శుభంబులయ్యెడు నని యానతిచ్చి ఆదేవదేవుం డంతర్హితుం డయ్యె నంత మేల్కాంచి యా రాజన్యశేఖరుఁడు భగవదాదేశమును స్మరించుచు సంజాత రోమహర్షణుఁ డగుచు నా కంజాతనయనునకు మణిమయహర్మ్య గోపురప్రాకారంబులు వినిర్మింపఁజేసి యందుఁ బురుషోత్తమునిఁ గేశవస్వామిని గండకాద్రినుండి వేంచేపుచేసికొని వచ్చి ప్రతిష్ఠింపఁజేసి తరింతునని దీక్షవహించి తనవాంఛ పేరోలగంబున వినిచి కుమారులలో భువనైకమల్లునిం గాంచి యిట్లనియె. ౩౧౩

ఆ. వె. త్రిభువనైకమల్ల! ధీరజనోత్తంస!
వినుము నీవుచేయు విధముఁదెలియఁ
గనకరత్నఖచిత ఘనహర్మ్య నిర్మితి
వేగఁ జేయఁబంపు వేడ్కమీర. ౩౧౪

అదియెట్లనిన తత్ప్రకారంబెఱింగించెద వినుము. చంద్రకాంత శిలాస్తంభంబులును మణిమయమంటపంబులును భర్మరమ్యహర్మ్య కవాట దేహళీకుడ్య వలభీవితాన విరాజితంబును గోపురాగ్ర విన్యస్తపద్మరాగ కలశసముంచితంబును హాటక వజ్రమయగర్భ రత్నసింహాసన విలసితంబుగా రచియింపుమనిచెప్పి వెండియు చాళుక్యమల్లునింజూచి నీవును ప్రాకారగోపురాట్టాలక దేహళీ

కవాటవిపణిమార్గోభయ పార్శ్వభాగంబుల చంద్రశాలా సహిత
వివిధగృహంబులును, మణితోరణధ్వజోద్యానాదిరచనావిశేషంబు
లొనరింపుమని యానతిచ్చి మఱియును వీరహెంబాళు నుద్దేశించి
యిట్లనియె 307

సీ. నాకగ్రసుతుఁడవు నళినాప్తనిభతేజ
వీరహెంబాళపృథ్వీవరేణ్య!
నామాట జవదాటవేమాటకైనను
పితృభక్తిశీలసత్ప్రియుఁడనీవు
నేఁజేయు పనినీకునిక్కంబుసేయుంగ
ధర్మంబుగావునఁ దనయవినుము
గండకాద్రికినేగి పుండరీకాక్షుని
వరదునారాయణు వాసుదేవు
శ్రీహృషీకేశుఁ గేశవు శ్రీసమేతు
మేఘనిభగాత్రు గోవిందు మిహిరతేజు
భక్తజనపోషుఁ బరితోషుఁ బరమపురుషు
నమ్మి దోడ్కొని రావలె నిర్మలాత్మ! 308

కం. అని జనకుఁ డానతిచ్చిన
విని హర్షోత్కర్షుఁడగుచు వినయానతుడై
జనవర! యచటికిఁ జని నే
ఘనుఁ గేశవుఁ దోడితెత్తు కాంతు ఫలింపన్. 309

గీ. ఆవగ నిప్పుడె శుభలగ్న మనఘచరిత!
చంద్రతారాబలంబులు చాలు నీకు
మేలుగావున సేనతో శ్రీలఁజనుము
కార్యసిద్ధియు నీకగు శౌర్యధుర్య. 310

అని జనపాలమౌళి తన కుమారునిఁ బ్రయాణోన్ముఖునిఁ గావించిన
నాతఁడు తలిదండ్రులకును బెద్దలకు నమస్కరించి నిల్చిన ౩౧౯

ఉ. వందన మాచరించినను వారును కూర్మియు నివ్వటిల్ల నా
నందము బిక్కటిల్లఁగను నందను గౌఁగిటఁ జేర్చి కృష్ణ గో
విందుని తోడితెమ్ము! యరవిందభవాయువు లెల్లవేళలన్
బొందుగ నీకు నాయువును బుణ్యయశోవిభవంబు లీవుతన్. ౩౨౦

అని ప్రియంబెసఁగ నాశీర్వదించి పంపి రప్పుడు ౩౨౧

ఉ. స్యందన ఘోటకేభభట సంఘసముజ్జ్వల యూథవర్య లా
నంద మెలర్పఁ గొల్వఁగను నవ్యతరస్ఫుట తూర్యనాదముల్
క్రందుగ మ్రోయ వారనవకంబు దళాత్ములు వందిమాగధుల్
దండడి నేగుదేరఁగను తద్దయునొప్పఁ బ్రయాణ మయ్యెడన్.

అది మఱియును చిత్రవర్ణంబులగు పటకుటీరనివహంబులును, విచిత్ర
చిత్ర కంబళంబులును, హంసతూలికాతల్పంబును, చీనోపధానం
బులును తాంబూలపేటి క్రముకపాత్రలును, గారుత్మత భోజన
చషకాది పాత్రలును, శాలితండుల గోధూమ మాష ముద్గ చణక
గుడ శర్కరాజ్య దధి క్షీరాదుల కావళ్ళును, లవణామ్ల మరిచ్యారా
మఠతిలసర్షప జీరకాది ద్రవ్యంబులును, హరిచందన మృగమద
సంకుమదాది ద్రవ్యంబులును, గోధేను సువర్ణ మణిమయభూష
ణాంబరంబు లపరిమిత ధనరాసుల భారవహులు లనేకులు తేరఁ
బరమానందకందళితాంతరంగుఁ డగుచు నా భూపాలనందనుండు
దినదిన ప్రయాణంబులఁ జనిచని గోదావరినదికిం జనుదెంచి యందు
కృతస్నానుండై ఆహ్నికకర్మకలాపంబు నిర్వర్తించి విప్రులకు
సమస్తదానంబు లొసంగి మృష్టాన్నపానంబుల సంతుష్టులం జేసి

తానును భోజనంబుచేసి పరిమళద్రవ్యంబు లొసంగి తానునుం గైకొని వెండియు భక్తిపూర్వకంబుగా శ్రీరమాసమేతుండగు శ్రీనృసింహదేవునిం గాంచి సాష్టాంగదండ నమస్కారంబులు గావించి షోడశోపచారంబులం బూజించి మహోపహారంబులు సమర్పించి దక్షిణాతాంబూలంబులు నివేదించి నీరాజనంబులు నివాళించి కృతార్థుండగుచు తద్దినశేషంబును నారాత్రి దీపారాధన నృత్యగీతవాద్యాది మహోత్సవంబుల దేవతాసార్వభౌముండగు శ్రీనృసింహదేవునకు మనోరంజన గావింపుచు నారాత్రిగడిపి మరునాఁడరుణోదయ సమయంబున నప్పరమాత్మునకు దండనమస్కారంబులాచరించి యమ్మహానదిని కృతస్నానుండై నావవలన నయ్యాపగాతిక్రమణంబుగావించి మార్గంబున ననేక దుర్గమారణ్య నదీనదపర్వత పుణ్యాశ్రమ పట్టణాదు లతిక్రమించుచు సుఖప్రయాణంబులంజనిచని పురోభాగంబున 3-౨3

మ. ఘనకంఠీరవ పుండరీకహరిణీ గంధేభభల్లూక దు
ర్జన భేరుండ లులాయ మర్కట లసత్సారంగ ఖడ్గావళుల్
తనరన్ జాతివిరోధముల్ విడిచి యుద్యత్ప్రేమ లుప్పొంగ పెం
పున వర్తిల్లు మృగాదిసత్త్వవితతిన్ భూజాని వీక్షింపుచున్. 3-౨౪

కం. సాలగ్రామవిలాస
శ్రీలలనాధీశజనన శిష్టక్షేత్ర
ప్రాలిత గండకీనదిఁ
బోలఁగ వీక్షించె నపుడు భూభుజుఁ డెలమిన్. 3-౨౫

కం. అపుడు సచేలస్నానము
నృపవరుఁ డొనరించి ధరణి నిర్జరతతికిన్

తపనీయరత్నగోచయ
మపరిమితస్ఫూర్తినిచ్చు నసురక్తితగని ౩౧౬

అమ్మహానది నతిక్రమించి తనపురోభాగంబున ౩౧౭

మహాస్రగ్ధర.
కనియెన్ రాజన్యుఁడంతం గటకతటఝురీగ్రమహారైకధాత్రీ
స్తనకుంభోదార లీలాచటులమృగమదస్ఫార సౌరభ్యమాద్రిన్
వినతోద్యద్దివ్యకాంతా విహారణకలనా విశ్రమస్థానభద్రిన్
ఘనసాలగ్రామలక్ష్మీకలితగుణగణాఢ్యాద్రి శ్రీగండకాద్రిన్ ౩౧౮

పంచపాది
గీ. ఇనుము జల్లినరాలక యిరులుగవయు
సాంద్రమందారమాకంద చందనామ్ర
పనససారంగ ఖర్జూరపారిజాత
మాధవీ మంటపంబులఁ మహితమగుచు
తనరు వనములఁ బొడఁగనె మనుజవిభుఁడు. ౩౧౯

తన్మధ్యప్రదేశమున ౩౨౦

మ. కనియెన్ భూరమణుండు ఫుల్లవిలసత్కంజాత కల్హారకాం
చనసౌగంధిక కైరవోత్పల రసాస్వాదైక భృంగావళీ
ఘనఝుంకారము రాజహంస బకకోకస్వచ్ఛవిస్ఫారమున్
జనితానందగభీరనీరము రమేశస్వైర సంచారమున్. ౩౨౧

ధనదు భాండాగారంబునుంబోలె పద్మమహాపద్మశంఖ మకరకచ్ఛ
పరమణీయంబై గ్రహమండలంబునుంబోలె కవి గురురాజహంస
విరాజితంబై యొప్పు నప్పద్మాకరంబు డాయంజని నిర్మలసలిల

పూరంబులఁ గృతస్నానుండై యాహ్నిక కృత్యంబుల నిర్వర్తించి పురోహిత పురస్సరంబుగా బ్రాహ్మణసంఘంబులఁ బూజించి దక్షిణతాంబూలంబు లొసంగి యచ్చోట గడిచిచని ముందర హాటక ప్రాకారగోపురాట్టాలక దేహళీకవాట వలభి స్తంభాభి రాజిత గరుడకేత నాలంకృతంబగు దివ్యసౌధంబుగాంచి త త్ద్వా రంబున తద్భవనంబు ప్రవేశించి గారుత్మతమణిమయంబైన మధ్య రంగంబున నద్దేవతాసార్వభౌమునకు శిరస్సాష్టాంగ దండనమ స్కారంబు లాచరించి తన్నికటప్రదేశంబున నిలిచి కరకమలం బులు ముకుళించి భయభక్తి తాత్పర్యంబుల నానందబాష్పాకుల లోచనుండును పులకితగాత్రుండును భక్తిరసావేశుండగుచు తదీయ మూర్తిని సేవించుచు పునఃపునర్వందనంబు లాచరించి కరకమల ముకుళిత నిటలతట ఘటితుండై యిట్లని ప్రస్తుతించె. ౩౩౨

రగడ:

జయరమాధీశ్వర! సర్వలోకాధార!
భయదదానవదహన! పటుచక్రధరధీర!
రుక్మిణీవదనాబ్జరోలంబ సంచార!
రుక్మాత్మవిధ్వంస! రుచిరకిటిగంభీర!
సత్యవధూవదన చంద్రజ్యోత్స్న చకోర!
నిత్యాత్మ! గోవింద! నీరదాభశరీర!
శ్రీవత్సకౌస్తుభాంచిత! జనావనకరుణ
ప్లావనధునిజనిత బంధురోజ్జ్వలచరణ!
గరుడవాహన! కృష్ణ! కంసాసురధ్వంస!
పరమమునిహృత్పద్మబంధురోజ్జ్వలహంస!
గోపికాకుచకుంభ కుంకుమాంకితవక్ష!

ద్రౌపతి యభిమానరక్షణోద్యద్ధత!
భల్లూకపతిసుతా బాహుపంజరకీర!
సల్లాస్యసూర్య జా స్తనగిరీంద్ర మయూర!
భద్రాంగనోద్యానప్రకట వరభృతవర్య!
మద్రకన్యాహృదయ మహితపంకజసూర్య!
కంధిబంధనశౌర్య కమనీయ సౌందర్య!
సింధురావనధుర్య! సృష్టికారణచర్య!
వరమిత్రవిందైక వదనచాతక మేఘ!
పరిపంథిబలదమన బాణజాలామోఘ!
వేణునాదవినోద! విజయనూపురపాద!
బాణాసురోదగ్రబాహుహరణామోద!
శ్రుతిచోరుండైనట్టి సోమకాసురుద్రుంచి
ప్రతిభమీఱం గృతులు బ్రహ్మకిచ్చితిమించి
కూర్మావతారమై కొండమోచి సుధను
కూర్మిసురలకునిచ్చి గొనబుమీఱినదంబు
ఘనవరాహంబవై కనకాక్షువిదళించి
తనరంగొనకొమ్మునను ధాత్రిదాల్చితిమించి
ఘననృసింహస్ఫూర్తి కనకకశ్యపుంజీరి
ఘనుండగు ప్రహ్లాదుం గరుణంబ్రోచితిమీరి
వామనాకృతిబలిచె వసుధదానముగొనియు
ఆమహేంద్రుని కొసగితతుల సత్కృపమెరియు
పరశురామస్ఫూర్తి పార్థివావళిద్రుంచి
ధరణికశ్యపమునికి దానంబుగావించి
శ్రీరామవై ఖరిని సీతంగైకొనివేగ
ఆరావణునిగూల్చి యవనినేలితిబాగ

బలరాముఁ డటుదైత్య భంజనం బొనరించి
వలనొప్ప ధారుణి భారంబు వారించి
బుద్ధావతారమున పురసతుల బోధించి
సిద్ధబలరాక్షసుల శివునిచే గొట్టించి
కలికివై హయమేధ కష్టయవనాధిపుల
చలపట్టి విదళించి నిలిపితివి ధర్మమిల
పదిరూపముల ధాత్రి భారంబు వారించి
విదితవిక్రమధుర్య వినుతింతు కృపనించు
పాహిరమాధీశ! భక్తజనమందార!
పాహిమాం సర్వేశ! పాథోధి గంభీర!
కరుణించి నను బ్రోవు ఘననీలనిభగాత్ర!
శరణాగతత్రాణ! శంకరప్రియమిత్ర!
జేజే జగన్నాథ! జే జీవనోద్ధార!
జేజే దయాసాంద్ర! సృష్టిపాలనధీర!

కం. అని యిట్లు ప్రస్తుతించిన
జనపతి సత్పుత్రుఁ జూచి జలరుహనేత్రుం
డనియము దయ చిగిరింపఁగ
మనమునలరఁగ నిట్టులనియె మనుజాధిపుతో.

కం. మెచ్చితి నీ సద్భక్తికి
వచ్చెద లచ్చియును పంటవలతియు నేనున్
చెచ్చెర రథమెక్కించుక
క్రచ్చరదోడ్కొనుచు జనుఁడు గారవమెసఁగన్.

గీ. వీరహెంబాళనృపతికి విశ్వవంద్యుఁ
డానతిచ్చిన నీరీతిహర్ష మొదవ
సకలపూజలుగావించి సంభ్రమమున

ధరణి విభుధులతోఁ గూడి సరసవృత్తి
భోజనముచేసెనప్పుడా భూపసుతుఁడు॥ 332

తదనంతరంబున కనకరత్న శుద్ధజాంబూనదస్నిగ్ధంబును గరుడకేతనాలంకృతంబును మణిమయఘంటికా కింకిణీ విరాజితంబగు దివ్యస్యందనంబునిల్పి హర్షపులకితగాత్రుండగుచు పునఃపునర్వందనంబులాచరించి దివ్యమంగళవిగ్రహులగు శ్రీమహాలక్ష్మీవసుంధరామణీసమేతుండగు నద్దేవతా సార్వభౌము నయ్యాదికేశవు ననంతకల్యాణగుణనిధి నెత్తుకొని తెచ్చి తద్దివ్యరథంబుపై నిడియె నయ్యావసరమున,

కం. మొరసెను సురదుందుభులును
కురిసెను మందారవివిధ కుసుమ సువృష్టుల్
మెరసెను సురకాంతాజన
సరసోద్యద్గానలాస్య సంపదలెలమిన్. 339

ఉ. వారనితంబినీమణుల వారిలెమర్దళదింథిమిద్ధిమ
స్ఫారరవంబు తాళములు పాదయుగస్ఫుట నూపురధ్వనుల్
వారక మోయ భావరసవైభవ సంపదలుల్లసిల్ల నం
భోరుహనేత్రుమ్రోలపటు మోహనలీలల నాడిరెంతయున్ 340

గీ. వందిమాగధ సంస్తుతుల్ గ్రందుకొనియె
వేణువీణారవంబులు విమలతూర్య
భేరీభాంకృతులెంతయు భోరుసెలఁగె
శంఖకాహళ నినదముల్ సాంద్రమయ్యె. 341

సీ. కనకకంకణఝుణత్కారంబు లెసగంగ
చామరయుగళంబు భామలిడఁగ

ప్రాలంబహారాక్తిక ప్రకట సుచ్ఛత్రంబు
జిగిగబ్బిగుబ్బల మగువబట్ట
ఆలవట్టంబులు బాలాలలామంబు
లొయ్యారముగఁ దాల్చ నుబ్బుమిగుల
తాంబూలపేటియు తరుణియొక్కతెబూన
కాళాంజియొక పుష్పగంధిదాల్ప

గీ. వారకంజాక్షులాడఁగ వందిజనులు
ప్రస్తుతింపంగ ముందర పార్థివుండు
బంగరపుబెత్తుకొని బరాబరులుసేయ
ప్రభలువిలసిల్లె కేశవుపయన మపుడు. 38౧

ఇట్లు తులమహోత్సవంబున దేవతాసార్వభౌము ప్రయాణం బతి రమ్యంబై పంతుమీర గండశైలావతరణంబుసేసి పుణ్యవాహిని యగు నగ్గండకి నదీతీర దేశంబున నద్దివ్యరథంబునిల్పి యద్దేవతాధ్యక్షుం బంచామృతాభిషేక పూర్వంబుగా మంగళస్నానంబు గావించి మృదులదుకూలంబున నమ్మేనితడులొత్తి పీతాంబరంబు గట్టించి యుత్తరీయంబుల నవరించి కాంచనయజ్ఞోపవీతంబులు వైచి హరిచందనంబులలఁది నిటలఫలకంబున కస్తూరి తిలకంబు దిద్ది మందారాది కుసుమదామంబులు తులసీవనమాలికలు నివేదించి మణిమయాభరణంబుల సర్వాంగంబుల నలంకరించి సాంబ్రాణిధూపంబును నీరాజనంబులొసఁగి షడ్రసోపేతంబులగు నైవేద్యంబులుసమర్పించికర్పూరమిళిత తాంబూలంబులుమున్నగు షోడశోపచారంబులఁ బూజించి తానును పరమభాగవతోత్తమ భూసురవ్రసహస్ర సమేతంబుగా నుపయుక్తాహారుఁడై పాంచరాత్రాగమోక్తక్రమమున స్తోత్రంబునువందిమాగధ జనకైవారంబు

లును వారనితంబనీనృత్యగీతవినోదంబులనాపవలును రాత్రియుగడిపి ప్రభాతంబునఁ గృతస్నానుండై తాదృక్ప్రకారంబున నయ్యాది కేశవుఁబూజించి వందన సహస్రంబులాచరించి ప్రయాణోన్ముఖుం డయ్యె. తదవసరంబున తద్గిరిపాలకులైన రాజభృత్యులే తెంచి వినయపూర్వకంబుగా వీరహెంబాళ భూపాలునింగాంచి శిరస్సాష్టాంగ దండనమస్కారంబు లాచరించి వేడుకొన్న వారలంజూచి మీారేనిమిత్తంబున నిట్లుచేసితిరి వెరువక తెన్మని యభయం బొసంగిన వారును లేచి భయకంపితగాత్రులగుచు హస్తంబులు ముకుళించి ఫాలఫలకంబులఁ జేర్చి గద్గదకంఠులగుచు నిట్లు విన్నవించిరి.

సీ. విన్నపంబవధారు విజయరమాధార !
వీరహెంబాళ విస్ఫారతేజ !
ఈపట్టణం బేలు భూపాలుఁడత్యుగ్ర
శాసనుండచ్యుత చరణకమల
సేవానురక్తుండు శిష్టజనప్రియుం
డతుల విక్రమశాలితయశోధి
వీరసేనుండనవెలయును మద్విభుం
డతని యనుమతిపై నంబుజాక్షు

గీ. తోయదశ్యాము నచ్యుతుఁ దోడుకొనుచు
జనుఁడు; నటుసేయకున్న మా జనవిభుండు
చంపుతమ్మిందఱిని, గాన సదయహృదయ !
దీనులగుమమ్ము గావుము మానవేంద్ర! ౩౯౮

గీ. అనుచు ప్రార్థించు దీనజనాళిఁజూచి
వారి కభయంబొసంగె నపారకరుణ

మంత్రివరులను వీక్షించి మనుజవిభుఁడు
దీనికెద్దియుపాయంబు తెల్పుఁడనిన. ౩౮౭॥

అమ్మంత్రివరులు తమలో మంత్రాలోచనంబుసేసి దేవా! మనమేగి యతని కెఱిఁగించి తదాదేశంబున శ్రీరుక్మిణీధవుండగు కేశవుం దోడ్కొని చనుటయే యుక్తంబని విన్నవించిన హర్షించి సకల బలంబులను బ్రాహ్మణోత్తములను అర్చకులగు వైష్ణవోత్తములను నొక్కమంత్రివరుని శ్రీరమణీరమణు సేవార్థమునిలిపి తాను కతిపయజనంబులను దోడ్కొని మంత్రివరసహితుండగుచు రథారోహణంబుచేసి తూర్యరవంబులు మొరయ నా రాజనగరంబునకు జని తత్ప్రాంతంబున నయనాభిరామంబగు విమలోద్యానంబునవిడిసి బహువిధోపాయంబులొనరించి మంత్రులంబనిపిన నవ్వీరసేను దర్శనంబు దుర్ఘటంబైన నొక్కమాసంబు వేచియుండి చింతాక్రాంతుఁడై యామనుజపతినందనుఁడు వెరవువిచారించుచుండె ఇఁకనిట వీరసేనభూపాలుండును దినదినంబును గారుత్మత మణిమయపాత్ర సహస్రంబుల షడ్రసోపేతంబులగు భక్ష్యభోజ్యలేహ్యచోష్య ప్రముఖాన్నంబులు నింపి భాస్కరునకుంబంపి మార్తాండుండనుభవించినపిమ్మట తద్భుక్తపాత్రలు మగిడివచ్చిన తద్భుక్తపాత్రశేషాన్నంబులు పుత్రకళత్రసహితం బనుదినంబు ననుభవింపుచుండుటయు పరమపవిత్రంబుగా ప్రవర్తిల్లుచుండు. ఇట్లు సూర్యసంతర్పణ మవిఘ్నముగా సాగుచుండ నొక్కనాఁడు. ౩౮౮

ఉ. భానునిఁగూర్చి భూమిపతి బంగరుపాత్రలషడ్రసాన్నముల్
పూనినభక్తిఁబంపిన నభోముఖవీధి జనంగఁజూచి భూ
జానిసుతుండు లోనఁగడు సంభ్రమ మొప్పఁగ మంత్రివర్యుతో
తానవిచిత్ర మివ్విధము తథ్యముగాఁగఁ బంపు భృత్యులన్.

గీ. అని నియోగింప భృత్యుల ననిపె మంత్రి
వార లటకేగి తద్విధవర్తమాన
మరసి చనుదెంచి చెప్పిన ధరణివిభుఁడు
సచివవరుతో విచారించి సంతసించి. 3౮౮

పుష్పంబులు మగిడి వచ్చునంతకు కాచియుండి యయ్యవసరంబున అవి మగిడి వచ్చుటం జూచి యవ్వీరహెంబాళుండును శుచిర్భూతుండై నిలుచుండి కరకమలంబులు ముకుళించి భాస్కరునకు నమస్కరించి సజ్జనుండగు పుణ్యశీలుండు ధర్మపరుండేనియు శ్రీరమారమణీ రమణచరణకమల ధ్యానపరుండేనియు సజ్జనయిత్రియగు సుప్రభావధూరత్నంబు పరమపతివ్రతాలలామంబేనియు ఏనును మాతాపితృభక్తుండనై తినేనియు నయ్యాదికేశవస్వామి పాదపద్మరతుండనైతినేనియు నపుష్పరంబులు దివంబుననే నిలిచియుండుగావుత మఱియును పుడమికి దిగినేనియు వీనికి శ్రీకృష్ణచరణారవిందంబులాన యని యానఁబెట్టిన నవియు నంతరిక్షంబున నిలిచి కదలకుండిన తత్పట్టణాధీశ్వరుండగు వీరసేనుం డతివిస్మితుండగుచు నమాత్యుల రావించి నేడు పాత్రలంతరిక్షంబున నిలిచి రాకయుండుట కేమికారణం బని యడుగుటయును వారలు చింతించి యద్ధరణీవిభునితో మన నగరోద్యానమున విడిసిన రాజకుమారుని మహిమయే దీనికి హేతువు. కావున నాతనిం బ్రార్థించిన తత్కరుణావిశేషంబున పూర్వప్రకారంబున పాత్రలువచ్చునని విన్నవించిరి. అతండు శుచిర్భూతుండై భయభక్తితాత్పర్యంబుల రాజకుమారునికి వందనసహస్రంబు లొనరించి నిటలతటఘటితాంజలిపుటంబుగాఁ బ్రార్థించి గంధసింధురాశ్వకాంచనసహస్రంబులును మణిఖచితభూషణముక్తాహారంబులును వివులాంశుకంబులును చందనాగరు కర్పూర మృగమదాది పరిమళ

ద్రవ్యంబులును విలాసవతులైన యువతిసహస్రంబులును నొసంగి ఓ రాజకుమారా! ఉపపురమాత్మ్యమండగు శ్రీరమాధవుఁ గేశవుఁ దోడ్కొని చనుటకు నీ కధికార మిచ్చుచున్నాను. ఈపల్లేరములు భూమిపై దిగుట కనుజ్ఞనీయుమన రాకుమారుఁడును వల్లెయని సూర్యభగవాను నారాధించె. అంత నవి యెప్పటియట్ల రాజ భవనమున నవతరించె. అమ్మహిపాలుచేత పూజితుండై తదా మంత్రిణంబు పడసి యాతని పట్టణంబునకుఁ జని వీరహేంబా ళుండు మగిడి కేశవు సన్నిధి కేతెంచి యథావిధి పూర్వప్రకారం బునఁ బూజించి వందనంబు లాచరించి మహోత్సవంబున తత్త రంగిణి నుత్తరించి ప్రతిప్రయాణమునను పూర్వోక్తమార్గంబునఁ బూజించుచు పుణ్యధునీనివహంబులును శైలారణ్యపట్టణజానప దాది నానాప్రదేశంబు లతిక్రమించి వచ్చి నిజపితృరాజధానియగు మాయాపురంబునకు యోజనమాత్రంబు శ్రీమహాలక్ష్మీసమేతుండగు నమ్మహాత్ము నయ్యాది కేశవుఁ బురసీమ పతిరమణీయమగు నొక ప్రదేశంబున విడియించి పూజావిధానంబు లాచరించి తనతండ్రియగు పుణ్యశీలునకు లేఖవ్రాసె నదియెట్లనిన

ఉ. శ్రీమతు మేరుధీరునకు సింధుగభీరున కాశ్రితౌఘ చిం
తామణి కిందిరేశపదతామరసద్వయమత్తభృంగ సు
త్రామున కిద్ధశాత్రవ విదారణ విక్రమ శౌర్యసాహసో
ద్దామ యశోవిశాలునకు ధర్మనిదానుకు పుణ్యశీలుకున్. ౩౧౦

సీ. నీకు పదసేవకుఁడను నే నీకు సుతుఁడ
వీరహేంబాళుఁడను వాఁడ వినయమొప్పఁగఁ
జెలఁగి వందనశతములు చేసి మరియు
విన్నవించెద సద్విమారు వినఁగవలయు. ౩౧౧

కం. మీయానతిఁ దలమోయుచు
శ్రీయుతుఁ గేశవునిఁ గృష్ణుఁ జిత్తజజనకున్
తోయజనిభ సద్గాత్రుని
నో యవనీనాథ! తెచ్చియుంచితి నీకున్. ౩౯౨

ఉ. శ్రీరమణీకుచాచలవశీకర చారుమయూరమూర్తికిన్
వారిధిమేఖలావదన వారిజబంభరచక్రవర్తికిన్
సారసపత్త్రనేత్రునకు సాంద్రఘనాఘనచారుగాత్రుకున్
మీ రెదురేఁగు దేవలయు మించిన భక్తిరసంబు జొబ్బిలన్. ౩౯౩

మ. అనుచున్ వ్రాసినపత్త్రలేఖ నృపు డుద్యన్మోదహృత్పద్ముఁడై
తనలోనన్ పఠియించి మంత్రిజనులన్ దాక్షిణ్యుఁడై చూచి నా
తనయుం డేఁగి సరోరుహాక్షు జగదాధ్యక్షున్ రమానాథు స
ద్ఘననీలాంబుదగాత్రుఁ జేశవుని భక్తత్రాణుఁ దోడ్తెచ్చెఁగా.

కం. అని చెప్పిన నామంత్రులు
జనితానందమును బొంది జననాయక! నీ
తనయుఁడు ఘనుఁడై నందున
జని కేశవుఁ దోడి తెచ్చె సంతసమయ్యెన్. ౩౯౪

ఉ. ధన్యులమైతి మెంతయును ధారుణికాంతసుధామయూఖ రా
జన్యకిరీట సంఘటిత చారుపదాంబుజ! పుణ్యశీల! నీ
కన్యనృపాలురీడె లలితాంబుదగాత్రు రమాకళత్రు స
న్మాన్యవిభూతితోడ మధుమర్దను శౌరి నెదుర్కొనందగున్. ౩౯౫

ఉ. మంగళతూర్యఘోషములు మత్తగజోద్ధత బృంహితధ్వనుల్
రంగదువాజిహేషలును రమ్యరథోత్కటనేమినాదముల్

పొంగుపదాతిసంఘముల బొబ్బలు భీషణ భేరిభాంకృతుల్
సంగతిమించ భూభుజుఁడు సామజరాజము నెక్కి వేడ్కతో. ౩౫౭

మ. ధవళచ్ఛత్రము చామరద్వయ సముద్యద్రత్నదీప్తావళుల్
తవణింపుందగు వారకామినులు నాట్యంబాడ గానంబులు
త్సవమొప్పన్ వరగాయనీజనులు భాస్వత్ప్రేమతోఁ బాడ మా
ధవునిన్ డాయఁగ నేఁగుదెంచె వసుధాధ్యక్షుండు సమ్మోదియై.

కం. పూజా ద్రవ్యంబులు గొని
రాజపురోహితులు విప్రరాజియు బంధుల్
రాజీవాక్షు నెదుర్కొన
రాజవరేణ్యుండు వచ్చె రంజిలు భక్తిన్. ౩౫౯

కం. ఎదురేఁగుదెంచి నరపతి
సదమలసద్భక్తి వెలయఁ జయ్యన శ్రీశున్
సదయాత్మ నాదికేశవు
పదపద్మంబులకు మ్రొక్కె పరమప్రీతిన్. ౩౬౦

ఇట్లు శిరస్సాంష్టాంగదండనమస్కారపహాస్రంబు లాచరించి కరకమల యుగళంబు ముకుళించి నిటలతటంబున ఘటియించి సుస్వరంబున నిట్లని ప్రస్తుతించె. ౩౬౧

ఉ. నిష్కళనీరదాంగ హరి నీరజలోచన దైత్యవాహినీ
శుష్కతరాటవీదహన సూరిజనస్తుత వారిజాఘనః
పుష్కరపత్త్రిహంస మునిపూజితపాదసరోజయుగ్మ నా
దుష్కృతమెల్లబాపి దయదూకొన బ్రోవుము చెన్నకేశవా! ౩౬౨

చ. ఘననిభగాత్ర! కృష్ణ! మురఘస్మర! మాధవ! శౌరి! దేవకీ
తనయ! గిరీంద్రజావినుత! తామరసేక్షణ! వాసుదేవ! స

జ్జనసుత! వార్ధిజారమణ! శార్ఙ్గశరాసన శంఖచక్ర సా
ధన! నిను సంస్తుతింతు నను ధన్యునిఁజేయఁగదయ్య కేశవా! 323

ఇట్లనేకవిధంబులం బ్రస్తుతించి యప్పుణ్యశీలనృపాలుండు పరమవైష్ణవ సంఘంబుచేత షోడశోపచారంబులఁ బూజసేయించి వారును దానును నీరాజనంబులిచ్చి మంత్రపుష్పంబులు నివేదించి శిరసాష్టాంగ దండనమస్కారంబు లాచరించి యప్పరమాత్ము నిందిరా వసుంధరా సమేతంబుగా శుభముహూర్తంబున పురప్రవేశంబు చేయించి వివిధసత్కారంబులు విధ్యుక్తప్రకారంబున నాచరించి యప్పురము పరంధాము జగద్భర్తయగు నయ్యాదికేశవు కాంచనమణిమయహర్మ్యాభ్యంతరంబున గర్భగృహంబున శుద్ధజాంబూనద భద్రసింహాసనంబునఁ బ్రతిష్ఠసేసి నానావిధపూజ లధికానందంబున గావించి పునర్వందన సహస్రంబు లాచరించి నిత్యపూజావిధానంబు లాచరింప పరమభాగవతోత్తముల నియమించి సురభితైలంబుల దీపారాధనంబు లొనరించియు నైవేద్యాది సమస్తపూజావిధానంబులకు ననేక మనోహరద్రవ్యంబులు సమర్పించి యప్పుణ్యశీల నృపాధ్యక్షుండు కృతార్థుండయ్యెనని ధర్మనందనునకు నారదుండు చెప్పిన విధంబున శౌనకాదిమహామునులకు సూతుండు డెలింగించెనని

చ. వరద! ముకుంద! కృష్ణ! యదువంశపయోనిధిచంద్ర! రుక్మిణీ
గురుకుచపద్మ పటుకోరకయుగ్మ నటద్ద్విరేఫ! భా
స్కరశతకోటితేజ! నవసారసపత్త్రవిశాలనేత్ర! వి
స్ఫురితచిదాత్మ! విశ్వమయశోభిత! శాశ్వత! శ్రీశ! కేశవా! 324

కం. శరణాగత జీవావన
కరుణామృతపూర్ణహృదయ కౌస్తుభరత్నా

భరణా! యదుకులభూషణ
చిరగంగాపురని వేశ శ్రీరమణీశా ! ౩౬౮

మాలిని. జగదవన విలాసా! సాధుహృత్పద్మవాసా !
నిగమవినుత పాదా! నిర్మలానంద మోదా!
త్రిగుణరహితచిత్రా! దేవకీదేవిపుత్రా!
ఖగకులవరవాహా! కమ్రమేఘాభదేహా! ౩౬౯

గద్య

ఇది శ్రీహరి గురుపాదపంకేరుహ ధ్యానానందచరిత్ర సరస సంగీత
సాహిత్య కవిత్వ రచనా విదిత తిరుమంత్రద్వయ నిత్యాను
సంధాన కౌశలహృదయ సౌందర్యగాత్ర ప్రోల్యాల
గోత్రపవిత్ర కోనమ దేవీకళత్ర మోటవాడవంశ
వారాశిజనిత కైరవమిత్ర బుధబంధునుకవిజన
స్తోత్ర రెడ్డి పర్వతరెడ్డిపౌత్ర రంగారెడ్డి
పుత్ర మల్లారెడ్డి దేశాయి ప్రణీతంబైన
గంగపురీమాహాత్మ్యప్రబంధంబు
నందు తృతీయాశ్వాసము.
శ్రీకృష్ణార్పణమస్తు



శ్రీ కేశవస్వామినే నమః
శ్రీమతే రామానుజాయ నమః

# గంగాపుర మాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము

శ్రీరుక్మిణీ ముఖేందు
స్ఫారస్మితచంద్రికైకపాన విలాసో
దార చకోర సముజ్జ్వల
శ్రీరమ్యా చెన్నరాయ శిష్టవిధేయా! ౩౬౮

దేవా! విననవధరింపు మాతరువాతి కథావృత్తాంతం బెట్లయ్యె నని శౌనకాదిమహామునులకు సకలపురాణేతిహాస కథాకథన శేముషీ సమేతుండగు సూతుం డిట్లనియె.

అట్లు శతానందనందనుండు ధర్మనందనున కిట్లనియె. ౩౬౯

ఆ. పరుసవేది లింగ పటిమను తత్క్షేత్రి
నికటపూర్వదిశను ప్రకటమగుచు
దేవసేనతటిని తీరంబునను నిల్చె
మహిత తాళవన సమగ్రసీమ. ౩౭౦

ఆ. వెలసి నినుము మోప వేగ బంగారమై
కరము ధరణి మెఱయు కతనఁ జేసి
పరుసవేది లింగ పటిమశోభిల్లుట
తద్వ్యధైకవిభవ హృద్యమనఘ! ౩౭౧

కం. ఆమాయాపుర వనమున
రామారత్నములు విమలరాజీవాక్షుల్
కోమలగాత్రలు యాదవ
శ్రీమహితకులాఢ్య లతుల సితకరవదనల్. ౩౨౨

క. కిక్కిరియు గుబ్బచన్నులు
తొక్కక నిలువంగవచ్చు తోరపుపిరుదుల్
చొక్కపు తుమ్మెదగుంపుల
నిక్కగు కచభరము లమృత నికరాధరముల్. ౩౨౩

చ. వలుద మెఱుంగుగుబ్బలును వాలికచూపులు ముద్దుచెక్కు లిం
పలరెడి మందహాసలలితాధరబింబము లొప్పు కొప్పులు
జ్జ్వలవరదిందుమండల లసద్వదనల్ మృగరాజమధ్యలా
చెలువలరూపవిభ్రమ విశేషవిలాసము లెన్న శక్యమే. ౩౩౪

ఆ లలితాంగు లింగె మతంగెమలను నామంబుల ప్రవర్తిల్లుచుందు
రని చెప్పి వెండియు నిట్లనియె. ౩౨౫

గీ. వారలిద్దఱు సోదరుల్ వైభవమున
మండలకుఁబోయి బాలు సమగ్రలీలఁ
దెచ్చుచుందురు నిత్యంబు పెచ్చుపెరుగు
యవ్వనారంభగర్వముల్ నివ్వటిల్ల. ౩౨౬

చ. శివుఁడొకనాఁడు కేశవుని శ్రీచరణాబ్జము లరిగొల్వ ను
త్సవమున వచ్చి మ్రొక్కియును దాత్తతఁ గమ్మర నేగుదెంచుచోఁ
గవగొనవందు గొల్లనవకంజదళాక్షులఁజూచి నంత న
య్యువతుల రూపవిభ్రమ సముజ్జ్వలకాంతుల కాత్మమెచ్చుచున్

గీ. చూచి వెరగంది వంతలో సూనశరుఁడు
మోహనాస్త్రంబు లురువడి ముంచి హరుని

2988/
Reference

మోహపరవశుఁ జేసెను సాహసమున
హెచ్చు తనతోంటి పగఁ దీర్చి పెచ్చుపెరిగి. ౩౭౯

ఇట్లు మన్మథాయత్త చిత్తుండగుచు నమ్మహాదేవుండు తనచిత్తంబున నాగోల్లపల్లవాధరల యుల్లంబులు పల్లవింపజేయు నుపాయంబు చింతించి యాచిత్తజారాతి తదవసరంబున.

సీ. మిసమిసల్ దైవాఱు మేనకప్పురబూది
ఘుమ్మను వాసనల్ గ్రుమ్మరింప
భసితత్రిపుండ్రంబు ఫాలభాగంబున
కేదారకడయముల్ కెంపులీన
పట్టెసల్లాణంబు పైమించు గోణము
రుద్రాక్ష పోగులు రుచులెసంగ
పసణియణసుబెత్తు భసితంబుభస్త్రిక
కెంగేల నెంతయు రంగుమీఱ
ముద్దుమొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త
తళుకు పావాలు పదములగుల్కరింప
మిండజంగమువేషంబు మెండుకొనఁగ
సతులముందటఁ గనుపట్టె శంభుఁడపుడు. ౩౮౦

గీ. పాలకడవలు దించి యా పద్మముఖులు
మాయజంగంబునకు మ్రొక్కి శ్రేయమపుడు
కలుగనిమ్మని దీవించి కౌఁగిలించి
పొలుపుమీఱ విభూతిని బొట్టు పెట్టె ౩౮౧

కం. ముసిముసినవ్వులు కన్నుల
మిసమిసలను జూచి శివుని మీనేక్షణ లిం

For REFERENCE ONLY
శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.

పెనఁగఁగ మోహాతురుగా
వెనఁజేసిన జంగమనియె విరహార్తి దగన్. ౩౮౨

సీ. పయ్యెదలోఁ జక్రవాకపక్షుల నేల
దాచినారలొ; కావు తమ్మిమొలలు
అట్లైన మాకిదుఁ డభవు పూజార్థంబు;
కావవి కాంచనకలశయుగము
అభిషేక మొనరింపనొ బిందెలిం డన
నవి కావు పూఁగుత్తు లరసిచూడ
తెండు పూఁగుత్తులు దేవతార్చనకన
నీరాదు మన్మథుఁడేలు వనము
లనుచు గర్భోక్తు లీరీతి నాడ నగుచు
తగున కన్యకలిటు కల్ల మిగులఁ బలుక
ననిన నేమంటిమని కొంటెదనముఁ జూప
చిగురువిల్తుని వాగురి శివుఁడు వడియె. ౩౮౩

వారును తదీయ సౌందర్యలావణ్యవిలాసంబుల కోటుపడి భావాదుల ప్రభావంబునఁ దమ చిత్తమ్ము నెఱిఁగింప నా గొల్లపూఁబోఁడుల యనురాగం బెఱింగి సంతోషితస్వాంతుండగుచు నసమనేత్రుఁడు వారితో నసమశరసమరవిహారంబుల లీలం దేలి యక్కపటిమిండ జగంబు వారల కిట్లనియె. ౩౮౪

గీ. ఏను శంభుండ మీకెద్ది యిష్టమిపుడు
వేఁడు డిచ్చెదనన వారు వింత నవ్వి
యీవు శంభుండవగుటకు నెద్ది గురుతు
నిన్ను నమ్మఁగ నేరము నిక్కువముగ. ౩౮౫

చ. అనవిని శంకరుండనియె నాదరమొప్పఁగ నింతులార నే
నొనరఁగ నిమ్మహానది సముజ్జ్వలతీరవిశాలసీమ శో
భనఘనతాళకావనవిభాసిత భూతలమందు వేడ్కతో
వినుఁ డటనుందునే పరుసవేది యనందగు లింగమూర్తినై. ౩౮౬

గీ. పండె మీపున్నెమిఁక మీరు పాలుపెరుగు
లమ్మఁ బనిలేదు నామాట నమ్మి వేగ
రండు మీవారు మీరును రయము మిగుల
ననుచుబల్కి తిరోహితుండయ్యె శివుఁడు. ౩౮౭

అంతట నా యాదవ మహిళాశిరోరత్నంబు లానందంబునుం బొంది
పాలకడవలెత్తుకొని యతి త్వరితగమనంబున ౩౮౮

ఉ. గొల్లకుమారికామణులు గొబ్బున నిండ్లకు నేగుఁ దేరఁగా
ఫుల్లసరోజలోచనలఁ బోలఁగఁజూచి రతిశ్రమంబు సం
ధిల్లఁ దెరింగి కూతుల విదేమియటన్నను సిగ్గుతోడ నా
తల్లికి విన్నవించిరి ముదంబు మదిన్ చిగురొత్తుచుండగన్. ౩౮౯

ఉ. ఆవనితాలలామ లపుడాత్మను శంకయొకింతలేక సం
భావనమీరఁ దమ్మునట భర్గుఁడు వంచన మాయజంగమై
భావజకేళి దేల్చిదయబల్కిన యట్టిసుహాస్యపద్ధతుల్
శ్రీవెలయంగఁ జెప్పినను చిత్తమురంజిలు తల్లియుత్తరిన్. ౩౯౦

క. మగనికి సుతులకు కోడలి
మగువలకవ్విధముఁ జెప్పి మానిని యపుడా
మృగశాఖాయత నేత్రల
మిగులను వన్నెలుగఁ జేయుమించిన కూర్మిన్. ౩౯౧

సీ. సంపంగినూనెను సొంపుగాఁ దలలంటి
కస్తూరి నలుగిడి గారవమున
శ్రీగంధపటిలిక ప్రేమతో తగఁబెట్టి
జలకముల్ సేయించి వలనుమిగుల
జిలుగుటవ్వాలువచే చెలగిమైతడులొత్తి
నెరులు ఝూడించి వన్నియదలిర్ప
చీనాంబరంబులు చిత్రకంచు కములు
కట్టగనిచ్చి ప్రాకటముమీఱ
మలయజము మేననలఁది సన్మహితపుష్ప
వితతి తురుమునందురిమియు విమలరత్న
ఖర్మమయభూషణశ్రేణి ప్రభలుమిగుల
తిలకమును దీర్చి మోమునఁ దళుకులొలుక. 32

ఈరీతి సర్వాంగాలంకృతులం జేసి సమీచీనాన్నపానంబుల సంతృ ప్తలంజేసి కర్పూరమిళిత తాంబూలంబు లొసంగి గారవించి తాము ను మృష్టాన్నపానంబుల సంతుష్టులై తద్దివసంబును రాత్రియు న్గడపి మరునాడు ఉషఃకాలంబున పునఃపునర్విభూషణంబు దాల్చి తమ తల్లిదండ్రులను సోదరులను గూడి తదాదిష్టక్షేత్రంబునకున్ జని తాళీయువనమధ్యంబున దేవసేనాతరంగిణీతీరదేశంబున దివ్య తేజోవిరాజమానుండగు పరుసవేదిలింగంబునుం బొడగాంచి యద్భుతరసానందనిర్మగ్ను లగుచు తద్దివ్యమూర్తిఁ జేరంజని శిరస్సాష్టాంగదండనమస్కారంబు లాచరించి తాము దెచ్చిన లోహపాత్రంబు లద్దేవదేవుని లింగాంగసంగతంబు సేయుటయు తత్క్షణంబ 33

క. బంగరుగనెలై మిక్కిలి
రంగులు వెదఁజల్లఁజూచి రంజిలియునుముల్

సంగతి మోపిన నవియును
చెంగట పసపైనఁజూచి చెలఁగుచుభక్తిన్ ౩౯౮

క. వందనశతములు సేసిన
కందర్పవిరోధినగుచు కన్నులకనియెన్
డెందంబలరఁగ మీరా
నందంబున నుండుడింక నాతోనిచటన్ ౩౯౯

గీ. నిత్యమును వేడ్కమీరును నెమ్మిమిగులఁ
లీలఁ గేళుల దేలుడు శ్రీ లెసంగు
నిలను మీ పేరునిలువఁగా నిరవుగలుగు
దేవళముగట్టి డిచ్చోట దివ్యసరణి

అనిన నాపల్లవాధరలు వల్లెయని శిల్పులరావించి కట్టంబులొసంగి వేఁయు నుపకరణంబులిచ్చి వీడ్కొల్పినవారును తదవసరంబున కాంచన ప్రాకారగోపురాట్టాలక కుడ్యకవాట దేహళీవలభివిటంక స్తంభాభిరామంబుగా దేవళంబును విరచించిరెట్లనిన. ౩౯౭

ఉ. స్ఫాటిక మధ్యరంగమును పాకవిరోధి శిలావితర్దులున్
హాటకరత్న పద్మపటుహర్మ్యచయంబులు పచ్చరచ్చలున్
నీటగు పద్మరాగమణి నిర్మలకుంభవిరాజితంబుగాఁ
జాటిలగట్టిరెంతయును భర్గునకుందగు దేవళంబొగిన్

క. శైవాచార సమగ్రుల
పావనచారిత్రులైన బ్రాహ్మణవరులన్
భావజహారణసుపూజా
ధీవిభవులనిల్పిరపుడు తెరవలు భక్తిన్. ౩౯౯

గీ. శంకరార్చన విధులకు సాంద్రవస్తు
సంఘమొడఁగూర్చి మృగమదచందనాది
వివిధపరిమళ ద్రవ్యముల్ విరులకెయ్యె
సతులొసంగిరి భక్తుల స్వాంతమరల. ౪౦౦

కం. కనకాంబర మణిభూషణ
ఘనవాహన నృత్యగీత గాంధర్వకళా
జనితోజ్జ్వల వారస్త్రీ
జనముల నియమించిరపుడు చంద్రనిభాస్యల్. ౭౦.

అంత తద్వృత్తాంతంబంతయు సపుత్రుండగు పుణశీలధరాధ్యక్షుఁ డాకర్ణించి తత్క్షణంబున పూజాద్రవ్యంబులు సమగ్రంబులగు నినుప ముద్దలు పట్టించుకొని పురోహితబ్రాహ్మణామాత్య సకలసేనా పరివృతుండగుచు కవిగాయక వందిమాగధ బృందస్తుతులు వారవితంబినీమణుల నృత్యగీతవిలాసంబులు రంజిల్ల మహోత్సవంబున నేతెంచి శిరస్సాష్టాంగదండనమస్కారంబు లాచరించి షోడశోపచారంబులం బూజించి నృత్యగీతాది విద్యావినోదంబుల సంతప్రొద్దుపుచ్చి గిరిజామనోహరుని సేవించి తాము తెచ్చిన యయఃపిండంబులు దేవతాధ్యక్షు మోపినమాత్రన శుద్ధసువర్ణంబు లగుటకు పరమాద్భుత హర్షాశ్రుపులకితగాత్రుం డగుచు పునఃపునర్వందనసహస్రంబు లాచరించి తద్ద్రవ్యంబులు సమస్తంబును విద్వజ్జనకవిగాయక వందిమాగధ వారకంజేక్షణ నివహంబుల కొసంగి కృతార్థుండగుచు నిజమందిరంబున కేతెంచి సుఖవిహారంబుల రాజ్యపరిపాలనంబు సేయుచుండెనని చెప్పిన నారదమునీంద్రునకు నక్కురువరేణ్యుండు సవినయమ్మున మహాత్మా! అమ్మహాదేవుండు గొల్లచబ్బెతలఁగూడి యేలీలఁ గేళీవిలాసంబునం బ్రవర్తిల్లె నానతిమ్మనిన నమ్మహానుభావుం డిట్లనియె.

చ. వనజశాక్షు లిందుధరు వాశ్చరకేతన కేళిఁ దేల్చుచో
మనమున సంతసిల్లి పురమర్దనుఁ డింతులఁ జూచి యిట్లనెన్
గొనకొని మీ సునామముల గొల్లెతగుళ్ళనగట్టి లింగకో
ట్లొనరఁ బ్రతిష్ఠసేయుఁ డటు లుర్విఁ బ్రసిద్ధియౌఁగీర్తిమీకగున్.

చ. అని హరిం డానతిచ్చిన నవాంబుజపత్త్రవిశాలలోచనల్
కొనకొని జాతిగిర్త్రిగన గొల్లెత గుళ్ళటుశట్ర్ఘంగుదులోఁ
బనివడి శంభులింగముల భక్తిఁ బ్రతిష్ఠలొనర్చి పూజలుం
డనర శివాగమప్రకటధన్యుల విప్రుల నిల్పి రెంతయున్. ౪౦౪

ఉ. నిచ్చలు వేడ్కవచ్చి నవనీరజగంధులు చంద్రహాళితోఁ
గచ్చర కేతనాజి నధికప్రమదంబునఁ గొంత వింతలన్
జెచ్చెర వేడ్క సల్పెడి విచిత్రము మెచ్చి కపర్దివారికిన్
నిచ్చలుగోరు రత్నమయ నిర్మల వస్తు లొసంగె సత్కృపన్.

అని చెప్పిన ధర్మనందనుం డమ్మునీంద్రున కిట్లను మహాత్మా! అప్పుణ్య శీలుం డెవ్విధంబున వసుంధరా పరిపాలనం బొనరించె. తత్తనూభవు లేయేవిధంబున రాజ్యమేలి రారీతి వివరింపుఁడని వినయంబునఁ బ్రార్థించిన ౪౦౬

చ. అన విని నారదుం డనియె నబ్ధిసుతాహ్వయమేశు సత్కృపన్
దనరిన పుణ్యశీల నరనాయకుఁ డాతని కూర్మిపుత్రులన్
సనయత బెండ్లిసేయఁగను చందనగంధిని సుప్రభాంగనన్
గొనకొని మాటలాడుతఱిఁ గుంతలశాధిపు డప్పుడెంతయున్.

కం. తన ముద్దుకూఁతుఁ దమ్ముని
తనయామణి నింపు మిగులఁ దగఁ బెండ్లిండ్లన్
సనయతఁ జేయఁగఁ దలఁచుచు
ననుసంభవుఁ జూచి వల్కె హర్షంబెసఁగన్. ౪౦౮

విను వీరసేన నాయనునకు కూఁతులగు పద్మావతిని నీకుమారరత్నంబగు మదనరేఖాలలామను మన సుప్రభానందనులగు వీరహేంబాళ భువనైకమల్లులకు నిచ్చుట యుక్తంబనిన నతండును వినయవినమితోత్తమాంగుడగుచు మీ రానతిచ్చిన చందంబునఁ జేయ నవధరింపుండని విన్నవించిన తద్వచనంబు లాకర్ణించి పరమహర్షోత్కర్షంబున పురోహితపురస్సరంబుగా నా నరపుంగవులఁ

బిలిపించి సత్కారంబులం బూజసేసి యప్పుణ్యశీలనృపాలు పేర
లిఖితంబు వ్రాసి పంపె నెట్లనినన్ ౭౧౮

సీ. శ్రీమన్మహారాజ సింధు శిరోరత్న
పుణ్యశీలనృపాల భూరిశౌర్య
శత్రుజయుండ మీ చరణసేవకుఁడను
దండనమస్కృతుల్ తగనొనర్చి
విన్నపం బవధారు వీరాధివీర శ్రీ
వీర హెంబాళ పృథ్వీశ్వరునకు
నాముద్దుతనయను రామాశిరోమణి
పద్మావతియను పద్మముఖిని
వేడ్కనాతమ్ముఁడై నట్టి వీరసేను
కూఁతు హరినీలకుంతలఁ గువలయాక్షి
మదన రేఖను భువనైక మల్లునకును
వెలయ నిత్తుము శుభములు వెలయగాను. ౭౧౯

గీ. అనుచు నీరీతి కుంతలాధ్యక్షుఁడెలమి
వ్రాసి విప్రులచేఁ గమ్మఁబంపఁ జదివి
మేలు మేలని యాపుణ్యశీలనృపతి
మిగుల హర్షించె నెంతయు మేదినీశ. ౭౨౦

ఇట్లు చదువుకొని సంతోషితస్వాంతుండగుచు వైవాహికాలంకృతులు
పట్టణమందెల్ల సేయించుచు గంధేభాశ్వవీరరథభటనివహాబహుళ
సేనాసంఘంబులుం గొలువ వివిధాలంకారంబులను స్రక్చందన
చిత్రాంశుకంబులచేతను పుత్రామాత్య సమేతంబుగా నలంకృ
తుండై రంజిల్లె *

---

* ఇటనుండి గ్రంథపాతమైనది.

# శోధన పత్రిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౬ | ౧ | తిమ్మధరాధినాథు | నమ్మధరాధినాథు |
| ,, | ౪ | తిమ్మభూవిభుం | నమ్మభూవిభుం |
| ౭ | ౧౬ | వరుసతో | వరుసను |
| ౧౨ | ౧౨ | హాత్పద్మఁడన్ | హృత్పద్మఁడన్ |
| ,, | ౧౪ | మోహావిభుఁడు | హేమవిభుఁడు |
| ౧౩ | ౧౮ | ప్రప్రశస్తంబగు | ప్రశస్తంబగు |
| ౧౪ | ౫ | పల్లెపల్లి | మల్లెపల్లి |
| ౧౫ | ౧౬ | సంస్తవచరిత్ర | సంస్తుతచరిత్ర |
| ౧౬ | ౨ | ఆక్షరునకు | అక్షరునకు |
| ,, | ౫ | (సు9 | (సు) |
| ౧౭ | ౪ | కీర్తస్ఫురణన్ | కీర్తిస్ఫురణన్ |
| ,, | ౫ | కీర్తినీయంబయ్యో | కీర్తనీయంబయ్యో |
| ,, | ౨౦ | భజించు | భజింతు |
| ౨౦ | ౮ | మౌక్తికజాలమంద్రుసు | మౌక్తికజాలమందురు |
| ,, | ౧౦ | దేవతానదిలో | దేవతానదిని |
| ౨౧ | ౩ | కేతనద్యుడుల్ | కేతనద్యుతుల్ |
| ౨౩ | ౯ | అరపిందములం | అరవిందములం |
| ౨౫ | ౬ | ధ్యాఃనానంద | ధ్యానానంద |
| ౨౮ | ౧ | లిప్రునిన్ | విప్రునిన్ |
| ,, | ౧౦ | దేవసేనాఖ్యనదిలో | దేవసేనాఖ్యనదిని |
| ,, | ౧౪ | నప్పురపురుషు | నప్పురమపురుషు |
| ౨౭ | ౧౩ | పుణ్యారంధ్రి | పుణ్యపురంధ్రీ |
| ,, | ౨౨ | నాట్యనరరంబు | నాట్యనగరంబు |
| ౩౦ | ౨౦ | గరిమెతో | గరిమను |
| ౩౩ | ౮ | సైకితశ్రోణి | సైకతశ్రోణి |
| ౩౫ | ౫ | వసదనంబు | పసదనంబు |
| ౩౮ | ౪ | నీటిలో | నీటను |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౯ | ౨౧ | యుతుస్సంగ | యుతస్సంగ |
| ౪౩ | ౧౯ | బెట్టేయ | బిట్టేయ |
| ,, | ౨౧ | వార్ధిలో | వార్ధిని |
| ౪౪ | ౧ | దోషంబునకను | దోషంబనకను |
| ౪౯ | ౧౦ | బిసరుహాక్షులంసుంగడి | బిసరుహాక్షులయంగడి |
| ౫౨ | ౭ | పుణ్యశీలకృపాలు | పుణ్యశీలనృపాలు |
| ౫౩ | ౬ | సుస్థిమ | సుస్థేమ |
| ౫౪ | ౧౧ | చిలుకకొ | చిలుకల |
| ,, | ౧౩ | కైరవాపుని | కైరవాప్తుని |
| ౫౯ | ౨౧ | బుగ్నిచయ | బుజ్నిచయ |
| ౬౦ | ౧౮ | హాస్నకుకురు | సుంహాకుకురు |
| ౬౧ | ౧౦ | యేతెంచి | యేతెంచె |
| ౬౬ | ౪ | శిరీముఖంబు | శిలీముఖంబు |
| ౬౮ | ౨౧ | చిరం | చెలంగు |
| ౭౯ | ౧౪ | దింధిమిద్ధిమ | దింధిమిద్ధిమి |
| ౯౩ | ౧౩ | ।శీజృష్ణ | శ్రీకృష్ణ |
| ౯౫ | ౧౨ | జేశవుని | గేశవుని |
| ౯౮ | ౧ | శార్జి | శార్ఙ్గి |

29887
Reference



శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.